పాపము, చిన్నతనముననే తల్లి స్వర్గస్థురాలయ్యెను. నాటి నుండియు సర్వము తానయై, మాధవుఁడామె నతిగారాబముతో పెంచుచుండెను. మాధవుడు మహాపద్మనందుని కొలువున నున్నతోద్యోగమునం దుండెను. కాని కాలమహిమ తెలియరానిదెంతకరము! నందుని కుమారులు చాణక్యుని విందు సభలో నవమానపరచుటచే నాతఁడు వారిని రాజ్యభ్రష్టులుగ చేయ శపథ మూని, పర్వతేందుని యాగ్రహమునకు గురియైన చంద్రగుప్తుని చేరి, సైన్యములు చేకూర్చి వారిపై కత్తిగట్టెను. ఆనాటినుండియు దేశములో రెండుపక్షము లేర్పడెను. రాజభక్తులెల్లరు నందుని పక్షము. దేశభక్తులెల్లరు చాణక్యునిపక్షము. నానాటికి చంద్రగుప్తుడు పరదేశీయులగు యవనులను జయించి, రాజ్యము నాక్రమించుకొనుచుండెను. మాధవుడు నందపక్షపాతి. అతఁడు చంద్రగుప్తుని దినదినాభివృద్ధి గాంచి, రాజకొలువు చాలించుకొని, రహస్యముగా నివాసము చేయుచుండెను. తాను నందపక్షపాతి యని పరు లెవ్వరికి తెలియకుండ కాలక్షేపము చేయుచుండెను. ఇట్లుండ నొకనాడు మాధవుడు తనయేకపుత్రికయగు సుశీలను వీడి దూరదేశము కార్యార్థియై పోయెను. అట్టి సమయమున యోధుఁడొకఁడు కొలదిమంది సైనికులతో త్రోవతప్పి, సాయంతన మగుటచే ప్రయాణము సాగించుటకు వీలు లేక, ఆ పట్టణప్రాంతమున విడిసెను. సమీపమున నెవ్వరో యుండిరని గ్రహించి, యింటికేగి సుశీలం గాంచెను. ఆమెయు నాతని కర్ఘ్యపాద్యాదు లొసంగి, యేదియో కొన్ని రసఫలములను, క్షీరములను ఒసంగి, అతిథిపూజ యొనర్చెను. ఆయువతీయువకులు ప్రథమావలోకనము వలననే పరస్పరానురాగులైరి. ఆనాటినుండియు విజయుఁడు నిత్యము సుశీలాదర్శనాపేక్షితుఁడై వచ్చుచు పోవుచుండెను. సుశీలతండ్రి నందపక్షపాతియని గ్రహించినప్పుడు విజయుఁడు చాల కటకటంబడెను. ఆతఁడు చంద్రగుప్తుని పక్ష మూనెనో యేమో! తండ్రి లేనిసమయమునందే వచ్చి, కొంత కాల మామెతో గడపుచుండెడివాఁడు. వారి ప్రణయము నానాటికి అధికము కాజొచ్చెను. శకుంతలాదుష్యంతులవలె, వీరిద్దరకు గాంధర్వవిధిని వివాహమయ్యెను. ఈ విషయము తండ్రికిమాత్రము తెలియదయ్యె. ఈవిజయుఁడే పైన వర్ణింపబడిన యోధుఁడని చదువరు లీపాటికే గ్రహించియుందురు.

## 3

మాధవుడు దూరప్రయాణమునర్చి అప్పుడే వచ్చియుండెను. అతఁడు చాల విస్మయమందుటయే కాక, మిగుల చింతాక్రాంతుఁడై యుండెను. సుశీలయు తండ్రిని జూచి మిక్కిలి దిగులొందుచుండెను.

"అమ్మా! చాణక్య చంద్రగుప్తుల విజయధ్వని దిగంతముల ప్రాకుచున్నది. మనకు సామీప్యమునందే శత్రుసేనలు విడిసియున్నవి. మన మీచోట నుంటిమని వారికి తెలిసెనా, మన ప్రాణములు మనకు దక్కవు. కనుక రేపు ప్రాతఃకాలమునందే యీచోటు బాసిపోవలెను." అని యతఁడు చెప్పెను. సుశీల మనస్సు చివుక్కు



మనెను. ప్రాణరక్షణార్థమై అచ్చోటు బాసి పోవుట న్యాయమే. కాని తన ప్రాణప్రియుఁడు తిరిగి తన కెట్లు కాన్పించును? తా నెచ్చటికి పోయినది అతని కెట్లు తెలియును? పోనీ, అతనికి వర్తమానమంపుదమన్న, తన రహ

స్వామి విల్లడియవునుగదా! కష్మ ప్రాయుదున్న, తన ప్రియుడెవ్వరో, అతని వాస్థలమెద్దియో ఆమెయెన్నడును కనుగొనియుండలేదు. తన పేరు "విజయుడ"ని మాత్రము ఆతడు నుడివియుండెను. ఇప్పుడు కర్తవ్యమేమి? తానీ స్థలము విడిచిపోవుచున్న ట్లాతనికి తెలియు టెట్లు? ఆమె దీర్ఘాలోచనచేసి తుదకిట్లు తెంపుకేసెను: "విజయుడు సైన్యమునందే యుండును. సైన్యము సమీపమునందే విడిసియుండెనని తండ్రి చెప్పెనుగదా! రాత్రిసమయమున నేనొక్కతెనే పోయి, అతని నచ్చోట కలిసికొని, యీ విషయము నాతని కెరుకపరచెదను".

## ౪

రాత్రి గాఢాంధకారముగ నుండెను. పదిగంటలు దాటిపోయెను. యుద్ధక్షేత్రమందలి డేరాలలో సైనికనికాయమంతయు విడిసి యుండెను. చాలమంది భోజనాదికృత్యములను గావించి శయ్యలపై జేరిరి. అంతయు నిశ్శబ్దముగ నుండెను. అట్టి సమయమున నంగనామణియొకర్తు శరీరమునిండ బట్టకప్పుకొని మేలిముసుంగు వైచికొని, ఆ డేరాలమధ్యమందేదో వెదుకుచున్న దానివలె పోవుచుండెను. ఆమె రెండు మూడు డేరాలను దీక్షించి, తనకు వలసిన వస్తువు లభింపమి, నిస్పృహ చెందుచు, తిరిగి మరియొక డేరాలోనికిబోవ సమకట్టుచుండెను. ఇంతలో "సుశీలా" యని యెవ్వరో సంబోధించినట్లాయెను. వెనుదిరిగి చూచునప్పటికి విజయుడు సాక్షాత్కరించెను. ఆమె యాతని వక్షమునజేరి దుఃఖాశ్రువులు రాల్పసాగెను.

"సుశీలా! ఇంత రాత్రివేళ నొంటరిగా నీవు వచ్చితివి? కంట నీరిడుచుంటివేమి?"

సుశీల చాలవరకేమియు పలుకలేదు. కప్పవాల్చక యాతని ముఖమువంక చూడ దొడంగెను. శరీరమంతయు కంపమునొందుచుండెను.

"ఏమి, పలుకకుంటివి?"

"విజయా! నీకొరకే వచ్చితిని. మన మొకరినొకరు విడిపోవలసిన దురదృష్టము సంభవించినది. శత్రువులు తన్నుకనుగొందురను భీతిచే మా జనకుడీపదమును బాసి పోవ నుద్యమించెను."

"ఎప్పుడు?"

"రేపు ప్రయాణమునకే పోవలయునట. ఈ సంగతి నీకు దెలిపియుండనిచ ఆకాంక్షంగము కలుగకుండునని తోచి యిటు వచ్చితిని."

"ఇకముందెచ్చట నివసింప దలంచెను?"

"ఆ సంగతి నాకేమియు చెప్పలేదు. నాకేమియు తోచకున్నది. మనము తిరిగి కలిసికొనుట యెన్నడో?"

"ప్రేయసీ! భీతిల్లకుము. నీవెచ్చట నున్నను నీప్రియుడు రెక్కలు కట్టుకొని వ్రాలునని నమ్ముము."

"మనోహరా! మన మీ కష్టముల పాల్పడకుండ నుండుటకు వీలులేదా? వెంటనే నన్ను నీయందు చేర్చుకొనరాదా?"

"అది నాకంగీకారమే! కాని ప్రస్తుత మీ యుద్ధభూమియందు జీవనము గడపుదు, నిన్ను చేకొని యెచ్చట నుండెదను? అదియుంగాక, సైనికులు స్త్రీలోలురై యుండరాదను శాసనమున్నది తెలుగదా?"

"అట్లయిన, నే నీవిధముగ నెంతకాల ముండవలయునో?"

"యుద్ధము ముగిసినవెంటనే నిన్ను దప్పక కొని పోయి నా గృహము చేర్చెదను. అందాక—"

"అది యెన్నడో? ఈలోన వివాహవిఘ్నకలిగిన—"

"భయపడకుము. ఈలోనవచ్చి కొనిపోయెదను. చాలరాత్రి గడచినది. నాఅశ్వికదళము వెళ్ళిపోవును. అది నిన్ను నీ గృహసమీపమున విడిచిపెట్టును."

"వద్దు—వద్దు— నేను కాలినడకనే పోయెదను. విజయా! నన్ను మరువవు గదా?"

విజయుడు ఆమెను తన బాహువులలో చేర్చుకొని విశాలఫాలభాగమును తనహస్తముతో రాయుచు, ముద్దుగొని వీడ్కొల్పెను. ఆమెయు మెల్లమెల్లగ నేగుచుండెను. ఇంతలో విజయుడు తిరిగివచ్చి, ఆమె నాలిం

గనవెంబర్చి, తన అశ్వముపై నిడికొని ఆమె గృహసమీపమున దించెను.

"విజయా! ప్రతి నిమిషము నీకై కొందురుచూచుచుండెదను. నా ప్రాణములు నీ చేత నున్నవి. జ్ఞాపకముండునా?" అని చెప్పుచు, ఆ గాఢాంధకారములో నదృశ్యమాయెను.

౫

నెలలు గడచిపోయెను. సుశీలకు ఆరవమాసము కూడ జెల్లిపోయెను. ఆమె తండ్రి కీసంగతి యేమియు తెలియకుండెను. ప్రియుడింకను తన్ను చేరకపోవుటవలన సుశీల చాల కటకటం బడుచుండెను. ఈలోన దేశములో చాలమార్పులు కలిగినవి. చంద్రగుప్తుడు యవనులను పాంచాలమునుండి పారద్రోలి చాణక్యసహాయమున ఉత్తర హిందూస్థానమంతయు జయించి నందవంశీయుల నంతరి వాళ వెంబడించి, మగధరాజ్యమునకు పట్టభద్రుడాయెను. ఆ కారణమున సుశీలామాధవులు తమ ప్రాణము లరచేతులం దుంచుకొని యేనిముషమున కేమి వాటిల్లునోయని మిక్కిలి భయపడుచుండిరి. తన ప్రియుడు శత్రుపైన ప్రాయోధుడయ్యెనని సుశీల చాల దుఃఖించుచుండెను. ఆ సమయమున నొక సైనికుడొకడు లేఖ నొకదానిం గొనితెచ్చి సుశీల కొసంగెను. ఆమె యాతురతతో దానిని విప్పి యీక్రిందివిధముగ చదివికొనెను—

"సుశీలా,

నిన్ను సందర్శింపవలెనని చాల యత్నించితిని. మీరున్న ప్రదేశముకూడ నా చారులవలన గ్రహించితిని. కాని దేశములో కలిగిన మార్పులవలన నా కార్యభారము అధికమాయెను. ఇకముందు నిన్ను చూడగల్గుదునన్న యాశలేదు. మనకు కలుగబోవు బిడ్డనుగూర్చి నాకు మీలగునంతవరకు శ్రద్ధతీసికొందును.

—విజయుడు"

ఈ ఉత్తరము చూచుటతోడనే, సుశీల మొదలు నరకిన కదళీ వృక్షమువలె నేలగూలెను. "బిడ్డనుగూర్చి వ్రాసెను. కాని తల్లిగతి యేమికావలయును?" కొంతవర కామె స్పృహతప్పి పడియుండెను. ఉత్తరము కూడ నామె ప్రక్కనే గాలి కెగురుచుండెను. ఇంతలో ఆమె




తండ్రి అచటి కరుదెంచి నేలపై పడియున్న తనూజను, ఆమె ప్రక్కనేయున్న ఉత్తరమును కనుగొనెను. తోడనే ఆ లేఖందీసి ఆమూలాగ్రముగ చదివికొని నివ్వెరజెందెను. సుశీల కన్నుల విప్పెను. ఎదుటనున్న తండ్రిని కనుగొని లజ్జా భయములు తన్నావహింప, తల వంచుకొనియెను.

"సుశీలా! ఈ లేఖమూలమున నీవు చెప్పకుండగనే సర్వము విదితమయ్యెను. నీవొనర్చిన కార్యము మన క్షత్రియ కులధర్మమునకు తగినదే యున్నది. కాని యీ విజయు డెవ్వరు?"

"తండ్రీ! క్షమింపుము. అతని విజయుడనుట తప్ప అత డెవ్వరో నాకు దెలియదు. అతనికి నా యాత్మను ప్రేమపూర్వకముగ సమర్పించియుంటిని"—

"ఎంత వెఱ్ఱిదానవు! అతని వంశనామము లెవ్వియో తెలియకుండ నేల చేపట్టితివి?—దీనివలన నీ కగు నష్టమేమియో గ్రహించితివా? నీ బిడ్డ అనాథుడై తండ్రికి దూరస్థుడై యుండవలసివచ్చును—"

సుశీల యేమియు మాటలు పలుక లేదు. కాలము గడచిపోవుచుండెను. ఆమెకు పదిమాసములు నిండెను. ఒకశుభముహూర్తమున ఆమె కొక తేజోవంతుడగు పుత్రుడుదయించెను. అతని కేమియు పేరిడలేదు.

దేశములో కల్గిన మార్పులవలన నందవంశీయుడగు మాధవునకు కష్టదినములు సంప్రాప్తమాయెను. శత్రువు లాతని వెదకి పట్టుకొనిరి. అతనిపై వధియోగము పెట్టి న్యాయస్థానమున విచారణ జరుప నెంచిరి. సుశీల చాల దుఃఖితురాలై యుండెను. నేడో రేపో విచారణ ప్రారంభ మగునని తలచుచుండిరి. ఇంతలో వెనకో యొక సేవకుడు ఒక లేఖం గొనివచ్చి మాధవున కొసంగెను. అం దిట్లుండెను___

“దీనియందు అనుమతిపత్రము కలదు. దీనివలన మీరు వెంటనే ఈదేశము వీడి పోవచ్చును. మిమ్ముల నెవ్వరు నిరోధింపరు. విజయుని కోర్కెవలన నిది మీకొసంగబడెను.

చంద్రగుప్త.”

దానింజూచి, సుశీలామాధవులు చాల సంతసించి, కరుణార్ద్రహృదయుడగు చంద్రగుప్తుని కొనియాడుచు, వారాదేశము వీడి, దక్షిణదేశమునకు బోయిరి.

## ౬

రెండేండ్లు గడచెను. సుశీల కుమారుడు శుక్లపక్ష చంద్రునిరీతి దినదిన ప్రవర్ధమానుడగుచుండెను. తల్లికిని, తాతకును తన బాల్యచేష్టలచే చాల నానందము చేయుచుండెను. కాని సుశీలమాత్రము భర్తృవియోగముచే చాలకృశించి, ఖిన్నురాలై యుండెను. ఎట్లయినను తన బాలుని తండ్రిని కనుగొను ఉద్దేశముతో తిరిగి ఉత్తరదేశమునకు పోవలెనని సుశీల ప్రోత్సహించుటచే మాధవు డంగీకరించెను. తిరిగి పది దినములలో పాంచాలదేశము చేరిరి. కాని వెంటనే యీతడు నందవంశీయు డని గ్రహించి పాంచాలదేశాధికారి, మాధవునకు ఉరిశిక్ష విధించి, చక్రవర్తి యాజ్ఞకై నిరీక్షించుచుండెను. కాని నియమితకాలము గడచిపోయినను చక్రవర్తి యొద్దనుండి యేమియు నాజ్ఞ రాదయ్యెను. అందుచే నొక యుదయమున మాధవుని ఉరిస్తంభ మెక్కించిరి. సుశీలయు, ఆమె చిన్నికుమారుడును ప్రక్కనే నిల్చి కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండిరి. ప్రజలెల్లరు సుశీలనుజూచి చాల విచారించుచుండిరి. ఇంకొక నిమిషములో మాధవుని తల తెగిపడిపోవుట సిద్ధముగనుండెను. ఇంతలో దూరమున గుఱ్ఱపుడెక్కల ధ్వని వినవచ్చెను. శరవేగమున ఆశ్వికుడొకడు సమీపించి, “ఆగుడాగుడు-



చక్రవర్తి యాజ్ఞ” అనుచు, అశ్వమునరోధించి, యొక యాజ్ఞాపత్ర మధికారిచేతి కందిచెను. అది యాతడు పరిశీలించి, మాధవుని ఉరిస్తంభమునుండి క్రిందకు దింపి, యాతనిచేతికి చక్రవర్తియాజ్ఞాపత్ర మందించెను. దానిని చూచుటతోడనే మాధవుడు మందహాసమొనర్పసాగెను.

చంద్రగుప్త చక్రవర్తి యాతని క్షమించి, తనవిశాల రాజ్యములో నితరులవలెనే నిరాక్షేపణగ నివసింపవచ్చునని యనుమతించియుండెను. ఈ క్షమాపణకు కూడ విజయుడే కారణమని ఉత్తరము వెనుక భాగముపై వ్రాయబడియుండెను.

# క్షత్రప రాజులు



3. మహాక్షత్రప యశోదాముడు

క్రీ. శ. ౨౩౮. క్షత్రపవంశమున నొక ప్రసిద్ధపాలకుడు



'దివాన్-ఇ-ఖాస్'

ఆగ్రాకోటలో నున్నది. ఇచ్చట మొగలుచక్రవర్తులు రహస్యమంత్రాంగసభలు చేయుచుండిరి. ఇది చలువరాతి కట్టడము. ౬౪ అ. పొడవు, ౩౪ అ. వెడలుపు, ౨౨ అ. ఎత్తుగల రెండంతర్భాగములు గలవు. ఇది ౧౬౩౭-వ సంవత్సరమున నిర్మింపబడినది. భారతదేశమునందలి సుప్రసిద్ధ సుందరభవనములలో నిది యొకటి.

నేడు చంద్రగుప్తుని పట్టాభిషేకదినము. తత్కారణమున నాతని సైన్యమంతయు బారులుదీరి, రాజగృహమునకుబోయి, చక్రవర్తింగూడి, యూరేగ సంకల్పింపబడెను. దీనివలన సుశీల మనస్సులో క్రొత్త యాశలు మొలకలెత్తెను. ఈ అనంత సేనాసమూహములో తన విజయుని గుర్తింపవచ్చునను నాశ కల్గెను. ఈ సంగతి తండ్రితో మనవిజేసెను. ఒక యెత్తైన రమ్యహర్మ్యమున తండ్రియు, బిడ్డయు నాసీనులై యుండిరి. సేనావాహిని మెల్లమెల్లగా కదలివచ్చుచుండెను. మొదట కాల్బలము నడుచుచుండెను. తన మనోనాథుడు అశ్వారూఢుడగు నని నమ్మియుండుటచే సుశీల కాల్బలమునంత శ్రద్ధగా చూచియుండలేదు. తదుపరి అశ్వికులు చనుదెంచిరి. సుశీల తదేకదీక్షతో పరిశీలించుచుండెను. కాని విజయుడందును లేడయ్యెను. అటుపైని రథములు కదలిపోయెను. అందును విజయుడు లేడయ్యెను. చివరకు చక్రవర్తి యధిష్ఠించియుండిన మత్తగజ మొక్కటియే వెనుకబడి యుండెను. సుశీల విజయుని గాంచక పోవుటచే చాల దుఃఖించుచుండెను. ఇంతలో మత్తగజముపై నమర్పబడిన అంబారీయందు చంద్రగుప్తచక్రవర్తి పరివారసమేతుడై యరుదెంచెను. సుశీల యేలాగో ఆతని గాంచినంతనే కంపితగాత్రయై, తన స్థానమునుండి లేవబోవంగెను. తండ్రియు నామె ననుకరించుచుండెను. ఆమె నిదానించి, చూచిచూచి, కెవ్వున నొక కేకవైచి నేల గూలెను. మాధవు డామెనుపట్టుకొని "ఏమమ్మా! అట్లుంటివి?" అనెను.



"ఆతడే విజయుడు—నా బాలుని తండ్రి—చక్రవర్తి—తండ్రీ! క్షమింపుము" అని సుశీల ప్రాణములను విడిచెను.

---

## లోకవృత్తము

పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

ధర రెండువాతఁ బాతాళలోకముఁ జేరె సత్యమ్ము ధర్మమా సన్న్యసించె
తపము మున్నైన యుత్తమకృతుల్ వనిఁ జొచ్చెఁ దోలుజాతి వక్త్రిచాపలము హెచ్చె
తండ్రితోఁ గొమరుండు తగవాడఁగాఁ బాతెఁ బ్రభువులందు దురాశ ప్రబల మయ్యె
జఘనచాపలము స్త్రీజాతి కెచ్చుగఁ జేరెఁ బురుషుండు స్త్రీలకింకరతఁ గోరె
కష్టములు చుట్టుకొనుచుండె శిష్టులకును - దుష్టులకుఁ బ్రాభవమ్ము సందృష్ట మయ్యెఁ
గలికిఁ బదునాల్గునెలలైనఁ గాకమునుపె - యిట్లు లగుచుండ నింకముం దెట్లు లగునొ?

---

# యుగధర్మము

ప్రియసోదరి రాజ్యలక్ష్మికి—

ఆశీర్వాదములు.

మీరు ఇంగ్లండునుండి తిరిగివచ్చి రెండుసంవత్సరము లైనది. అచ్చట మీరు మూడుసంవత్సరములు నివసించితిరి. నీవు నా కీరెండు వత్సరములనుండి క్రమముదప్పక నెల కొక యుత్తరము వ్రాయుచున్నావు. అందలి విషయముల గాంచి మేమందరము సంతసించుచున్నాము. నీయుత్తరము వచ్చుట యొకదిన మాలస్యమైనచో నాకు పిచ్చియెక్కినట్లుండెను. పిల్లలు 'ఈ యుత్తరము రాలేదేమి' అని పలుమారులు నన్నడుగుచుండిరి. కాని ప్రత్యుత్తరము వ్రాయనైతిని. కారణ మేమన నేమి వ్రాయుదును. నీకుత్తరము వ్రాసినను నిన్ను చూచుటకు వచ్చినను మాకు కలితప్పను. ఏమిచేయుదును. మీ రింగ్లండు బయలుదేరినప్పటినుండియు మీ బావగారి మానము దినదినప్రవర్ధమానమగుచుండెను. కాని నీయుత్తరము లాయన తప్పక చదువుచుండెను. నీవు వ్రాయు వివిధవిషయములుగల పెద్దయుత్తరములను చదివి చేతిపెట్టెయందు దాచుకొనుచుండిరి. ఆయన మీకు ప్రత్యుత్తరములు వ్రాయుచుండెనని నే నింతవరకు తలంచుచుంటిని. కాని నీ చివరయుత్తరమువలన ఆయనగూడ మీకు ప్రత్యుత్తరములు వ్రాయుట లేదనువిషయము స్పష్టమైనది. అయిన దేమో యైనది. గతించినదానినిగూర్చి విచారించుట నిష్ప్రయోజనముగదా? ఏమైనగాని నామనోవ్యాకులత్వము మిన్నటితోడ సంతరించినది. భగవదనుగ్రహమువలన కొలదిదినములలో మేమందరము మీయింటికి రాగలమనుకొనుచున్నాము. ఆ ప్రయత్నమందే యున్నాము. రెండుమూడు నెలలయిన నీతో గలసి మెలసి యుండినగాని నాకు తృప్తియుండదు. వచ్చిరాని మాటలతోడ గందరగోళము చేయుచుండు చి|| కృష్ణునిచూచుట కిప్పటికి యవకాశము చిక్కినది. పిల్లలిద్దరు పిన్ని పిన్ని యని కలవరించుచున్నారు. నాల దినములలో తప్పక బయలు దేరి రాగలము.

అయిదారు మాసములుగ మాయిల్లు సంతబజారయిపోయినది. ఎప్పుడును గందరగోళమే. చి|| వేంకటలక్ష్మికి వచ్చే విదియతోడ పండ్రెండుసంవత్సరములు నిండును. మాఘమాసమువరకు మాత్రము రెండుమూడు పెండ్లి లగ్నము లున్నవి. అటుపిమ్మట మాఘము. పిమ్మట కొకటి రెండు నెలలవరకును మంచిలగ్నములు లేవు. మనయింటి కానవాయి పండ్రెండేండ్లకే గదా రజస్వలయగుట. ఎన్నో సంబంధములు వచ్చినవి. అందు నాల్గుసంబంధములు సర్వోత్తమమైనవి. చింతాకువారి పిల్లవాడు. ఇరువది సంవత్సరములలోపు వయసు. బి. ఏ. చదువుచున్నాడు. ఏబదివేల రూప్యముల యాస్తియున్నది. ఒక్కడే పుత్రుడు. తల్లి లేదు. తండ్రి ముసలివాడు. ఇది సర్వవిధముల నుత్తమమగు సంబంధము: పోట్లాటలు, కొట్లాటలు, కోడరికము మొదలగునవి యుండవని మీ బావగారి కన్ని విధములనో నచ్చచెప్పితిని. వారు మూడువేల రూప్యముల నగలు పెట్టుదుమనిరి. వేయిన్ని నూటపదార్లు కట్నమును కోరిరి. ఇంతకంటె మంచిసంబంధ మెక్కడనుండి వచ్చును? కట్నమీయగల శక్తి మీ బావగారికి లేదా. మేము చేయవలసినది యిద్దరు పిల్లలకు పెండ్లి చేసి యత్తవారిండ్లకు బంపుటయేగదా. అంతకంటె మాకు వ్యయ మేమున్నది? భగవంతుడు రక్షించిన నాలుగేండ్లనాడు రామచంద్రుడు. వాని పెండ్లి పదిపండ్రెండుసంవత్సరముల తరువాతమాటగదా. కాని యేమిలాభము. సంవత్సరమునుండి నెత్తిన నోరు కొట్టుకొని మీ బావగారికి పెద్దపిల్ల పెండ్లివిషయమును చెప్పుచుంటిని. అది యేమి కర్మమోగాని 'ఆ' అనరు 'ఊ' అనరు. చింతాకువారు రెండు నెల లాగి చివరకు వెల్లంకిలో సంబంధము కుదుర్చుకున్నారు. మీ బావగారికి నే నేమి చెప్పుదును. ఆయనకు తెలియని దేమున్నది. కాని నాకర్మ మిట్లున్నది. సమ్మములోనికి వచ్చి తలయెత్తుటకే నాకు వీలులేకుండెను. గ్రామములోని వారందరు నన్ను వ్రేలు పెట్టిచూపి ఘోషణ చేయుచుండిరి. సూటిపోటిమాటల

వెక్కిరింపుచుండిరి. "అక్కా! ఇది బ్రాహ్మణజన్మమా ఇదేం పాపకర్మమమ్మా! పండువంటి బ్రాహ్మడికి పాడు బుద్ధులు పుట్టినవి. కిరస్తానులలో కలుస్తారా యేమిటే? వాడున్నాడు గాదటే, పెద్దయిన్లోగెం కలెక్టరు, ఇంగ్లండు పోయి మాలమాదిగలతోడ మాంసము తిన్నాడు, వెలివేశారు. వాడిమాలావ యీ బ్రాహ్మడికొంప మునిగిందే." అని యనేకవిధముల మిమ్ము మమ్ము తిట్టి దుమ్మెత్తిపోయని యాడుదిగాని మొగవాడుగాని మా వూళ్లో లేరనుట వింతగాదు. అందువలన మాయింటికివచ్చువారెవరును కానరారు. పిల్లలుగూడ ఆడుకొనుటకు రామానిరి. అందువలన పిల్లలిద్దరు పెద్దపడి వీధిగడప దాటకుండిరి. నేను చీకటిపడిన తర్వాత మంచినీళ్లు తెచ్చుకొనుచుంటిని. మన్న బ్రాహ్మణ కొంపలు పది. అహోరాత్రము లిదే గొడవ. తిట్లు, శాపనార్థములు, వెక్కిరింపులు, హేళనలు– ఏమిచేయుదును.

మీ బావగారికి బుద్ధి చెప్పవలయునని చుట్టుప్రక్కల గ్రామములనుండి ముసలి ముతక వచ్చుచుండిరి. కాని యాయన చెంతగూర్చుండి యేమియు మాట్లాడినారలకొంతవడి మౌనముగనుండి చివర కాయన గాంభీర్యమునకు లోబడి వచ్చిన దారిని బట్టుచుండిరి. మీ బావగారు మాత్రము వినుచున్నను విననివారివలెను, చూచుచున్నను చూడనివారివలెను నటించుచుండిరి. నాకాయన పద్ధతి యణుమాత్రమైనను అర్థముగాకుండెను. దుఃఖతరంగము లుప్పొంగుచుండెను. జగత్తంతయు సానందోపాఖ్యానమందలి నరకలోకమును బోలి భయంకరముగ గన్పడసాగెను. అందువలన నా కారుమాసములుగ నిద్రాహారములు లేవనుట యతిశయోక్తి కాదు. కోన తెన్ను తెలియకుంటిని. పిల్లలు దిక్కుమొగము బెట్టుకొని యిల్లు దాటకుండిరి. ఏమిచేయుదును, ఎవరికిమొరలిడుదును. ఈదుఃఖసాగరమునుండి యేదేవుడు ఒడ్డున పడవేయును. శ్రీరామచంద్రమూర్తిని ధ్యానించుట దప్ప గత్యంతర మేమి?

క్రమక్రమముగ గ్రమ్ముకొనుచుండిన కారుమేఘములు మొన్నటితోడ విడిపడినవి. ఘోరాంధకారమంతరించినది. ఉషఃకాలమందలి సుమధుర గీతానినాదము వీనుల విందు గొల్పినది. జగత్తంతయు ఫలపుష్పభరితమై నయనానందకరముగ గన్పట్టినది. శ్రీమన్నారాయణుడు వివిధరూపరేఖావిలాసముల భావవీథియందు గోచరించెను. జయము శ్రీజగన్నాథా జయము. ఆర్తజనరక్షకా జయము.

వారము దినములక్రిందట అమ్మ నాయనలు వచ్చి పదిహేను దినములుండి తిరిగి యింటికి వెళ్లిరి. ఆపదిహేనుదినములయందు అమ్మ పట్టెడన్న మొక్కపూటయైనను తిన్నగ తినలేదు. అరగడియయైన నిద్దుర లేదు. నన్ను పిల్లల కౌగిలించుకొని యూవురుమని యేడ్చుట తప్ప మరియొకపని యామెకు లేకుండెను. అందువలన మాయిల్లంతయు దుఃఖసాగరమున మునింగెననుట యంతయతిశయోక్తి గాన్పింపదు. రాజ్యలక్ష్మీ! అప్పటి నాస్థితి చూడవలయునే గాని వర్ణించి చెప్పుటకు వీలు లేదు. ఇంతయును పూర్వజన్మసుకృత దుష్కృతము లనుభవింపక తీరదుగదా!

అమ్మ నాయనలు వచ్చినప్పటినుండియు మీ బావగారితోడ నిట్లు చెప్పుచుండిరి: "పెద్దవాండ్రము; వృద్ధులము; మామాటలు వినుము, పిల్లలుగలవాడవు. వేదాధ్యయన నిరతుడవు. షట్శాస్త్రముల చదివితివి. శిష్టాచారపరుడవు. ఇంగ్లీషు చదువుకొనినవాండ్ర గొడవ నీ కెందుకు. స్వరాజ్యమా, మాలమాదిగలలో బ్రాహ్మణులు గలియుటయేనా? స్వరాజ్యము కావలయునని యరచుచుండు వాండ్రవరి చేరకుము. వాండ్రు కులభ్రష్టులు; వర్ణభ్రష్టులు. ఇంతకు ఎవరికిని యేమిలాభము? రాజ్యలక్ష్మి కర్మ మిట్లు పట్టినది.

"ఫలానావారి శాస్త్రులుగారి కుమార్తె దొరసానులవలె బూట్సులు దొడుగుకొని సభలయందు దుపన్యసించుచున్న దనుమాటలు నా చెవులకు ములుకులగుచున్నవి. హృదయము బ్రద్దలగుచున్నది. కాని యెవరినందును? ఏదైవమును దూరుదును, స్వయంకృతాపరాధమునకు శిక్ష యేమి? కల్లికల్లి చచ్చుటే శిక్ష. వేదశాస్త్రాధ్యయన మొనర్చిన వారికొరకు బ్రాయశ్చిత్తింపక పాడుమెటు పరీక్ష

విచ్చితానని 1116 కట్నమిచ్చి కన్యాదాన మెవరిట్లు చెవరిచ్చు. ఇది నాబుద్ధితక్కువగాదా? దానిఫలమును నేననుభవించుచున్నాను. పండుగయని పర్వమని రాజ్య లక్ష్మిని దిలంచుకొనివచ్చుటకు నాకర్మము గాలినది. నాయనా! చిన్నప్పటినుండియు నాకడ చదువుకొంటివి. శాస్త్రములయం దద్వితీయుడవని పేరు గాంచితివి. భగవదనుగ్రహమువలన నీకు సంతానము గలిగినది. సంసారపోషణకు తగిన వసతి యున్నది. అపకీర్తిపాలుగా కుము. నీకడ చదువుకొనుచుండిన పదిమందిశిష్యులు పారిపోవుటకు కారణ మేమి? నాకర్మమును గాంచుచు నేయున్నావుగదా! కొంతమంది శిష్టాచారపరుల మనకొ మవారు నన్ను పంక్తికి రానివ్వుటలేదు. మాయింటికెవ్వరును భోజనమునకు రారు. పైకి చెప్పరుగాని దాదాపుగ నాకు వెలిపెట్టినారు. కాని యీ కలికాలమున అల్లుడింగ్లండుకుబోయిన మామగారిని శిక్షించుట న్యాయమా యని యడుగువా డెవ్వడు? అడుగువాడున్నను వినువా డెవ్వడు? ఎవరికివారే యమునాతీరే అనునటులున్నది మనసంఘస్థితి. ఇంతకు నాకు కలియుగవివాహమున ప్రవేశించితిని. తగిన ఫల మనుభవించుచున్నాను. అల్లునకు నెలకు రు 800-0-0 ల జీతము నిజమే; సంతసమే. కాని నాపాపఫలమును నేననుభవింపక తప్పదుగదా! బాబూ, నామాట వినుము. మూడునాలుగేండ్లయిన బ్రదుకుదుమోలేదో, ఇద్దరాడుపిల్లలకు మా యెదుట వివాహము చేయుము. సంతసింపుచు ప్రాణముల విడిచెదము. ఇంగ్లీషు చదువుకున్న వాండ్రమాటలు నమ్మకుము. వాండ్రే దేశము చేసినను దొరలపద్ధతి యని మరియొకటే యనుభవపూర్వకముగ చెప్పుచున్నాను. వివాహములు చేయనిచో, మే మిర్వుర మిప్పుడే మరణింతుము. తప్పదు" అని యనేకవిధముల బోధించిరి. భయపెట్టిరి. కష్టసుఖముల విప్పిచెప్పిరి. పాపపుణ్యముల వివరించిరి. వర్ణించిరి. ఫలమేమి? వారెన్నివిధముల బోధించినను, విలపించినను మాబావగారు మౌనముగ నుండిరేగాని పల్లెత్తి పలుకలేదు. శ్రద్ధగ వినుచుండిరి. కాని ప్రత్యుత్తరములేదు. అమ్మ నాయనల యుపన్యాసములతోడ నెప్పుడు ప్రొద్దుగ్రుంకెనో, ఎప్పుడు తెల్లవారెనో తెలియకుండెను. గ్రామములోని పెద్దలుగూడవచ్చి కూర్చుండి తలయూపుచుండిరి. చేతనైనంతవరకు నుపదేశము లొనర్చుచుండిరి. కాని మా బావగారిచేత 'అవును కాదు' అని యనిపించగలిగినవాడుమాత్రము కానరాకుండెను.

ఇట్లు పదమూడు దినములు గడచెను. పదునాలుగవదినమున తెల్లవారుజామునకే బావగారు లేచి స్నానసంధ్యాద్యనుష్ఠానముల నిర్వర్తించుకొని అమ్మను వెంట నిడుకొని పడమటింటియందు దేవతార్చన చేయుచున్న మా బావగారి కెదురుగ బోయి కూర్చుండిరి. చుట్టుప్రక్కలనున్న అమ్మలక్కలు చిన్నపెద్దలుకూడ వచ్చిరి. అప్పు డది యొక చిన్న సదస్యమువలె నుండెను. రెండు మూడు గడియలు గడచినపిమ్మట మా బావగారు పరమశివునివోలె నిమీలితనేత్రములు తెరచి లేచి నిలిచి నడుమునకు కొల్లాయిగుడ్డను బిగించుకొని యెదుట వీరాసనాసీనులై కూర్చుండిన అమ్మ నాయనల పదములకు సాష్టాంగపడి "జ్ఞానదానం బొసంగిన గురుదంపతులకు నమస్కరించుచున్నాను. ఆశీర్వదింపుడు." అని లేచి చేతులు జోడించుకొని సమ్ముఖమందు కూర్చుండిరి.

అప్పుడు నాయనగారి మోమును విలోకింపవలయును. నేత్రద్వయమునుండి యగ్నిస్ఫులింగములు బహిర్గతమగుచుండెను. అచ్చట నున్నవార లాయన మోము విలోకింపజాలకుండిరి. దూర్వాసమహర్షిని మరపించుమూర్తుల నొకింతకాలము వేనల్లునిమీద ప్రసరింపజేసిరి. కాని మా బావగారుమాత్రము ధీరగంభీర శాంతచిత్తమున మూర్తీభవించిన ధర్మమూ యనునట్లుల గురుదంపతుల పాదములమీద దృష్టి నిల్పి చూచుచుండిరి. అన్నకళ్లలనుండి యమృతప్రవంతి బయల్వెడల నచ్చట నున్నవారి హృదయపీఠుల ప్రవహించినకొలదిని కామ క్రోధ లోభ మద మాత్సర్యముల ప్రకోపము సన్నగిలుచుండెను. సదర్కేచ్ఛ కట్టువడెను. అనిర్వచనీయశాంతియం దెల్లరు మునింగియుండ ఆక్షేపము, ఆతాపము, ఆపట్టుదల, ఆసంఘభయము మొదలగునవన్నియు నొక్కత్రుటిలోన నాయనగారినుండి పలాయనంబై వంతనే శరీరమున చెమట పట్టెను. పిల్లలిద్దరు వినయశ్రద్ధలతోడ విన

రుచుండ నాయనగారు సుశాంతస్వరమున "వత్సా! దీర్ఘాయుష్మాన్భవ" అని దీవింప అప్పట నున్న వారెల్లరు స్మితవదనారవిందులైరి. మా బావగారు చేతు లుజోడించుకొని యా యాశీర్వాదమును శిరమున ధరించిరి అటుపిమ్మట నాయనగా రిట్లు నుడివిరి:—

"వత్సా! పన్రెండు వత్సరములు నాకు సేవ జేసితివి. వేదశాస్త్రముల నభ్యసించితివి. నీవినయవిధేయతలు, సత్యనిరతి, కార్యనిపుణతకు మెచ్చి కాళ్లు కడిగి కన్యక నిచ్చి వివాహ మొనర్చితిని. ధన్యుడనని తలంచితిని. కాని గురుదక్షిణ నప్పుడు కోరలేదు నీవీను లేదు. ఇప్పుడు కోరుచున్నాను. గురుదక్షిణ నిమ్ము."

అన నటనున్నవా రెల్లరును నొక్క మారుగ మా బావగారి కేసి నిశ్శబ్దముగ విలకింపుచుండ ఆయన లేచి మామ్మారు గురుదంపతులచుట్టు తిరిగి సాష్టాంగపడి "నాప్రాణమును మీకర్పించుచున్నాను గైకొనుడు" అన అమ్మ లేచి యల్లుని లేవదీసి గూర్చుండబెట్టెను. అప్పుడు నాయనగా రిట్లనిరి: "వత్సా! నాకు గావలసినది నీధనైశ్వర్యము కాదు, నీవు కాదు; నీపుత్రికల నాకొసంగుము. అదియే గురుదక్షిణ. గురువును సంతృప్తిపరచవా, రౌరవాది నరకముల బడుదువు, జాగ్రత్త. నీబిడ్డల నిద్వర మాకొసంగనంత వరకు మేము భుజింపము. ఈవిరాపనమున మరణించుట తప్ప గత్యంతరము లేదు."

అనుచుండ నటనుండువా రెల్లరు నిస్తబ్ధులైరి. మామ యల్లుండ్రిద్దరు సమానపండితులు, తపోనిగతులు. అందువలన ముందేమి జరుగునో యని నిశ్శబ్దముగ రెప్పవాల్పక చూచుచు గూర్చుండియుండిరి. పెదవి పెదవి కదపకుండిరి. చంటిపిల్లలుగూడ కొయ్యబొమ్మలవోలి యాస్పశ్య మును విలకింపజొచ్చిరి.

అప్పుడు మా బావగారు లేచి నిలిచి యటనున్న వారికెల్లరకు నమస్కరించి వేదగాన మొనర్చుచు అమ్మ నాయనల చుట్టు మువ్మారుదిరిగి సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి సమ్ముఖమందు గూర్చుండి మా త్రీభవించిన వినయవిధేయతలా యని చూపరులు తలంపుచుండ ఇట్లు నుడువం దొడంగిరి:—

"గురువరేంసమా, పూర్వజన్మ సుకృతమువలననే మీకు నేను సేవజేయు భాగ్య మబ్బినది. ధన్యుడను. మీకు గురుదక్షిణ నిచ్చుటకంటెను నేనొనర్పదగిన సత్కర్మ మేమున్నది. అన్నిటికంటెను ప్రియమైన పదార్థమును గదా గురుదక్షిణ యొసంగవలయును. నా ప్రాణముల గైకొనుడు. సంతసముగ నొసంగుదును. పరమసంతోషమున నిత్తును. కాని నన్ను సంకల్పవిచ్యుతునిగ జేయదలంపకుడు. సంకల్పచ్యుతుడగు వానికంటెను దరిద్రుడు మరియొక డుండబోడు; నీచుడు గానరాడు. శిష్యు డొనర్చు పుణ్యపాపములు గురునర్యునకుగూడ జెందును. సంకల్పమేగదా సర్వధర్మములకు మూలము. కావున శిష్యుని సంకల్పము నెరవేరుగాక యని యాశీర్వదింపుడు. మీరు నాకు పార్వతీపరమేశ్వర తుల్యులు. అందువలన నను క్షణము మీచరణధ్యాన మొనర్చుచుందును. మి మ్మారాధింపుచుందును.

"పండితాగ్రణీ, మీహృదయ వేదనను నే నెరుంగుదును. గురునర్యుని కలవరపెట్టుచున్నా నని నిరంతరము విలపించుచుందును. కాని చేయునది యేమి? అయిదారుమాసముల నుండి నాహృదయమున మహత్తరసంగ్రామము జరుగుచున్నది. అది రామరావణయుద్ధమును మించినదనుట యతిశయోక్తి కాదు. విచారించితిని, వివేకమునకు బట్టముగట్టితిని. కాని నాసంకల్పముమాత్రము చెడలేదు. దృఢమగుచున్నది. ఇప్పటికొక వత్సరముగ నాకు నిద్దుర లేదు. నిరంతరము నన్ను కలవరపరచుచున్నది. 'నాధర్మ మేమి? నాధర్మ మేమి?' అను ప్రశ్నయే. ఆడుపిల్లలవివాహము మనమున కు వచ్చినప్పుడెల్ల వేనవేలు శంకలు గలుగుచున్నవి. వాని సంఘర్షణమున వివశుడ నగుచుంటిని. కాని సమస్తమును భగవానున కర్పించుటతోడ శాంతి చేకూరుచుండెను. ఇంతకును భగవత్సంకల్పమున నాసంకల్పము విలీనమగునప్పుడే గదా యది యథార్థమగును. లేనిచో నది భ్రమ కావచ్చును? కాకపోవచ్చును. కాని యిప్పటి మన నిర్ణయించు టెట్లు? భావరాగ తాళముల సమ్మేళనమే గదా సంగీతము. పిల్ల వివాహవిషయము మనమునకు వచ్చినంతనే సంతసము గలుగుట లేదు. దుఃఖము వచ్చుచున్నది. పలు

యందు మనినింగిన కాలదిని పురుషుడు స్వేచ్ఛాచారియై రక్షణయను నెపమున తనంతట తానుగ స్త్రీరక్షకుడై యుద్ధములు మొదలగు వానియందు ధనకనకవస్తువాహనములతోడ స్త్రీలనుగూడ దొంగిలించు రాక్షసవృత్తికి దిగినకాలందిని స్త్రీలు దాసురాండ్రైరి.

"రెండవపాదమున స్త్రీ పురుషునిచేతి కీలుబొమ్మయై, బొంగరమై, పణ్యద్రవ్యమై సంపూర్ణముగ స్వశక్తిని గోల్పోయెను. పురుషునిదౌర్జన్యము మిన్నుముట్టెను. పురుషుడు కర్త, భర్త, హర్తయై ప్రవర్తింపసాగెనుటకు రామాయణ భారతాది గ్రంథములే ప్రబల నిదర్శనములు.

"ఇప్పుడు మానవుడు తృతీయపాద ప్రవేశమందున్నాడు. ఇక నిమ్నోన్నతముల కవకాశము లేదు. ధనికుడు, నిర్ధనుడు, మాలి, యజమాని, ఉత్తమకులము, నీచకులము, అస్పృశ్యత, దృష్టిదోషము, తెలుపునలుపు రంగులు ఇక మానవసంఘమును విభజింప జాలవు. ఒకరాని కొకటి [illegible] లేరు. స్త్రీని అబలయని, మూర్ఖురాలని, స్వాతంత్ర్యము లేనిదని నుడివి పంజరమందుంచుకాలము దాటిపోయినది. స్త్రీ స్వాతంత్ర్యమును హరించుటవలన గలిగిన నష్టమును పురుషు డిప్పుడిప్పుడు గ్రహింపుచున్నాడు. ముఖ్యముగ మనదేశమందు స్త్రీని వదలి పురుషుడే సమస్తకార్యముల నొంటరిగ జేయ గడంగుటవలన ఆయాకార్యముల నిర్వహింపజాలక మానవకోటి దృష్టికి వధముగానెను. అందువలన గలిగిన నష్టము నిప్పుడు పురుషుడు గ్రహింపుచున్నాడు. స్త్రీభాగము వంచింపుచుండినగాని వింటభాగమును బంధించి సరితప్పక కొట్టుటకు వీలులేదని పురుషుని యనుభవము నకు వచ్చెను. మానవకోటి వికాసమునకు స్త్రీపురుషులిద్దరు సమాన భాగ్యులని గ్రహించిన కాలందిని స్త్రీల బంధనములు పటాపంచ లగుచున్నవి. నారీమణి తలయెత్తి యనంతాకాశమందలి గ్రహనక్షత్రముల దిలకించినకాలందిని హృదయ ముప్పొంగ దివ్యగీతముల బాడుచు మాతృప్రాబల్య ప్రమ్మరయను మొనర్పుచున్నది. కావున నిక బంధింపబడి యుండదు, ఉండగాదు, ఉండలేదు.

గార్గి, మైత్రేయి, సత్యభామ, సావిత్రి, మీరాబాయి, సుమ్మరపెల్ల మొదలగు మహానారీమణులు తిరిగి భూమండలమున దవతరించి విశ్వవేదనను హృదయంగమ మొనర్చుకొని బృహత్తర మానవరూపము నుపలబ్ధిబొంది మృదుమధుర గీతావినాదము లొనర్పుచున్నారు. ఆగీతానినాదము మానవలోకమును బట్టి పీల్చి పిప్పిచేయుచున్న దుర్ఘటనమన్నాలకు స్వస్తి చెప్పుట కాదా! స్త్రీలు స్వశక్తిమీదనే యాధారపడుదురు. స్వేయాభివృద్ధి కాటంకములగలిగించు వాటినన్నిటిని స్వశక్తితోడనే యెదుర్కొందురు. బాహుబల జ్ఞానబలముల సర్వశక్తులై ప్రకాశించెదరు. ఆనాడనలే మానవసమందలి యం దెన్నుటమాచివను గాన్పింపురాన్నవి.

"ఇక నాకర్తవ్యమేమి? నా ధర్మమెట్టిది? మహాకాలగర్భమునందు బడిపోవుచుండు కామధేనువునైనను రక్షించుటకు బ్రయత్నింపను; విచారింపను; చింతింపను. భగవద్విధానము నద్దగించువాడెవ్వడు! కాలమే మృత్యువు; కాలమే జీవితము; కాలమే స్వర్గము; కాలమే యనంతపథమున పరువిడుటకు రాజమార్గము. పలురంగులు పలుపేర్లుగల చీట్లముక్కలను గలుపుటని యుద్దేశ్యమేమి? తిరిగి ప్రస్తరించుటకే గదా? జగజ్జనని మానవులనందర గలుపుచున్నది. ఎందుకు? తిరిగి ప్రస్తరించుటకే గదా? అవికసనము పూర్తియగుటతోడ మానవత్వము పరిపూర్ణమగును. సార్థకత జెందును. తదనంతరము —.

"పండితాగ్రగణ్యా! బొమ్మలపెండ్లిండ్లు చేయుచుందురా? లేక ఈ మహాప్రళయమునుండి తీవ్రవేగమున భవిష్యత్తు నాకర్షించుటకు స్వేచ్ఛగా విహరింప దీయుచుందురా? తమ యాశీర్వాదమువలన హిందూసంఘ రక్షణకు, భారతవర్ష స్వరాజ్యప్రాప్తికి నా సర్వస్వము సమర్పణ మొనర్చితిని. అందు నాసంతానము గూడ ఇమిడియున్నదని వేరుగ నుడువుట యనావశ్యకము. నాపుత్రికల కిద్దర కిరువది సంవత్సరములు వచ్చువరకు తగిన విద్యనిడితిని, కష్టపడి పనిచేయుటయును, స్వశక్తిమీద నాధారపడి లోకకల్యాణముకొఱకు నిరంతరము కృషిసలుపువారినిగ జేయుట నాకర్తవ్యము, నావిధి.

"ఇంతవరకు మనము ఖండసత్యమును దిలకించితిమి. ఇక పూర్ణసత్యమును దిలకింప వలయును. ఇందు "నేతి" యను పదమునకు తావు లేదు. ఒకసంఘమును వీడి మరియొకసంఘము, ఒకజాతిని వీడి వేఱొకజాతి పూర్ణ సత్యమును గ్రహింప జాలదు. అట్లు గ్రహించితిమనుట మనః కల్పన; భ్రమ.

"గురువర్యా! పరితపించుచున్న శిష్యున కిదమిత్థమని చెప్పి కర్తవ్యమును జూపుట ధర్మముగాదా? నా పుత్రికలకు నేను వివాహము చేయను. వివాహమొనర్చుకొనవలసిన వలదనను. సాంఘిక రాజకీయ ఆర్థిక నైతిక విషయజ్ఞానమును గల్గించుటకు బ్రయత్నింతును. జాతీయ వ్యక్తిత్వమును యోధనపద్ధతియు నలవడునట్టులచూతును. నారీలోకోద్ధరణకు నాపుత్రికాద్వయము నర్పింపుచున్నాను. అందుకు తగినట్టుల వర్తింపగలవారినిగ జేయుట కహోరాత్రములు పాటుబడుదును. 'జయ జగన్నాథా' మానవకోటి పాపభారమును నాశిరమున మోపుము. ఆభారమువలన క్రుంగి కృశింపుచు సంతసింతును. పలు బాధలకులోనై పరితపింపబడు మానవులకు శాంతి గల్గును" అని తిరిగి గురుదంపతుల పదకమలములమీద బడిరి. నాయనగారల్లుని ఆనందబాష్పముల నభిషేక మొనర్చుచు "తథాస్తు" అని ముమ్మారనిరి. సదస్యులు హర్షాశ్రువులు నించిరి. అప్రయత్నముగ జయజయని నాదము లొనర్చిరి.

మా బావగారు కర్పూరమును పళ్లెమున వెలిగించి శ్రీరామచంద్రమూర్తి సమ్ముఖమున నిలుచుండ ఆయన కిరుపైపుల నిర్వురుపిల్లలు నిలిచి మంగళహారతి బాడజొచ్చిరి. అప్పుడు అమ్మ నన్నుపిలిచి యల్లుని పక్కను నిలుచుండబెట్టెను. నావెనుక నామె నిలుచుండెను. నాయనగారల్లునివెనుక నిలిచిరి. అప్రయత్నముగ నేను "జయతి జగన్మంగళం హరేర్నామం" అను మహాగానమును బాడజొచ్చితిని. ఎల్లరును లేచి నిలిచి చప్పట్లు చరుచుచు మైమరచి హరినామస్మరణ చేయ జొచ్చిరి. టెంకాయలు కొట్టిరి. పరస్పరము కౌగిలించుకొనిరి. హృదయముల విప్పి మాట్లాడుకొనిరి. ఒకరి నొకరు దోష విరహిత దృక్కుల దిలకింపజొచ్చిరి. అప్ప టికి సాయంతనము మూడుగంట లాయెను. మా గృహ మున శాంతి తరంగములు మిన్నుముట్టజొచ్చెను. మృత్యు వును తృణప్రాయముగ చూడగలిగినవాడే గదా మృత్యుం జయు డగును. గరళమును చవిచూడగలిగినవాడే గదా యమృతమును చవిచూడగలుగును!

రాజ్యలక్ష్మీ! ఏమిచెప్పుదును; వ్రాయు టెట్లు? అప్పటి యానందము, ఆసంతసము- అనిర్వచనీయము! సాక్షాత్ అన్నపూర్ణనుబోలి యమ్మగారు బోసినోట నవ్వుచు వంటయింట ప్రవేశించిరి. ఏడుగంటలకు వంట సిద్ధమాయెను. స్త్రీపురుషులు ముప్పదిమందివరకు భోజన మునకు కూర్చుండిరి. పిల్లలిద్దరు స్నానమొనర్చి వ్రేలు ముడులు వీపుమీద తాండవమాడుచుండ మోమునందలి చంద్రరేఖకు కాటుక కన్నులకమనీయకాంతి వన్నె దెచ్చు చుండ ప్రతియొక్కని సమ్ముఖమునకు పిండితోడ అష్టద ళపద్మములను, షోడశదళపద్మములను రచించిరి. శిల్ప నైపుణ్యముతో గూడిన హస్తకౌశలమువలన పదినిమిష ములలో పద్మములువేసిరి. వానిమీద విస్తళ్లు పరచితిని. ఇంతలో దేవతార్చనలు జపములు పూర్తియాయెను. వేద గానము జరిగెను. పిమ్మట మా బావగారు రామచంద్ర మూర్తికి మహానైవేద్యమును బెట్టిరి. మంగళహారతు లిచ్చిరి. భోజనమునకు గడంగిరి. వంతులువేసికొని కృష్ణ కర్ణామృతము, రామకర్ణామృతము, గీతగోవిందము, శ్రీకృ ష్ణలీలాతరంగిణియందలి శ్లోకముల చదువుచుండిరి. ఇద్దరు పిల్లలును, మా బావగారును విసనకఱ్ఱలతోడ విసరుచు కావలసినపదార్థముల నడుగుచు, సరస సల్లాపములు చలోక్తులు మొదలగువాని ద్వారమున భగవానుని లీలా విలాసముల వర్ణింపుచుండిరి. భగవన్నామ స్మరణవలన గృహాంతరము ప్రతిధ్వనింపుచుండెను. ఎల్లరును లేచి చేతులు కడుగుకొనివచ్చి పంచయరుగులమీద కూర్చుం డిరి. దక్షిణ, తాంబూలముల నిచ్చినపిమ్మట మా బావ గారును, పిల్లలును, మేమును భుజించితిమి.

అప్పటికి రాత్రి పదిగంటలు దాటెను. చంద్రో దయమాయెను. తను మంత్రస్థిత మగుచుండెను. పనివాం డ్రకు భోజనము పెట్టితిని. జోడుకోడెల సవారిబండి సిద్ధ

దెను. నవీనముద్రణ పుస్తకములవలె నీప్రాచీన తాళ పత్ర గ్రంథములు లేఖక ప్రమాదముల కంతగఁ జోటీయవు. కావున నా యాశ్చర్యము ద్విగుణమై నే నంత పత్రములు తిరుగవేసి, యిట్టి యసంబద్ధాక్షరము లింకెచటనైనఁ గలవాయని శోధింపఁజొచ్చితిని. అంత నా యాశ్చర్య మేమని చెప్పను! కొన్ని పుటలు దాఁటిన వెనుక నింకొక చిట యక్కడ నిట్టివియే కానవచ్చెను. అంతట వెనుకటి పుటలు త్రిప్పి చూడఁగా నిట్టి యక్షరములె ప్రత్యక్షమయ్యెను. వీనియన్నిటి నొక పత్రమున వరుసగాఁ గూర్చి వ్రాసితిని. కాని యీ యక్షర సముదాయము అర్థరహితముగ నుండెను. ఈ సంజ్ఞాక్షరముల యర్థపరిశోధనమునందే నే నాదినము గడిపినను, నాకు లాభ మేమియుఁ గలుగలేదు. తను కార్యార్థము నాయొద్దకు పలుమారు వచ్చి నాకు చిరాకు గల్పించెడి నా కుమారుల నంత నే జూచి, "మీ రీయక్షర సమామ్నాయమునకు సమన్వయముచేసి యర్థము దెల్పితిరా, ఎట్లో మీ యభీష్టము నెరవేర్చెద!" నంటిని. అంత కొన్నిదినములవఱకును తండ్రియును, తనయులును ఈ క్రొత్త వ్యాపృతిని మునిఁగి యుండిరి. ఈ లోపుగ మా యింటఁ గల తాటియాకుల పుస్తకములన్నియుం నేను తిరుగవేసితిని. ఎందును నిట్టి వ్యర్థాక్షర ప్రయోగము గానరాకుండెను. అంత నొకనాఁడు నా చిన్న కుమారుఁడు ఈ యక్షరములనిక్కు విడఁదీయు నుపాయము మాకు చెప్పెను. మొదటియక్షరము పిమ్మట నొక యక్షరము, రెండవ దానివెనుక రెండక్షరములు, మూఁడవదాని మూఁడక్షరములు, ఇవ్విధమున వరుసగా విడిచిపై చివరయొద్దల, మిగిలిన యక్షరములు అర్థవంతమయ్యెను! అవి వరుసగా కూర్పఁగా నిటు లయ్యెను: "నిక్షేపము పెరటిసుడిముందు పెద్దచింతక్రిం—!"

గ్రంథపారాయణమున కథామధ్యమున నెవ్వరు గాని నిలుపరు. ఆ మఱునాఁటినుండియు నా కుమాళ్లు ఈ నిక్షేపాన్వేషణ కార్యము సర్వవిధముల సాధింపఁ బూనిరి. నాయొద్దనున్న తాటియాకుల పుస్తకము అసమగ్రముగ నుండెను. దాని రెండవభాగము మా బంధువులలో నొకరి వంశమున వచ్చియుండుటచేత, మా చిన్న వాఁడు దాని నొకపరి చదువుటకుఁ బుచ్చుకొని, దాని లోఁగల యధికాక్షరముల నీవిధముననే కూర్చి, మొత్తముమీఁద తేలిన అక్షరసమామ్నాయము నిట్లు చదివెను:

"నిక్షేపము: పెరటిసుడిముందు పెద్దచింతక్రింద, తూర్పుదిక్కున తొమ్మిదిమూరలదవ్వున!"

## 3

అప్పటినుండియు మా యింట నెన్నఁడును లేని నైకమత్యము సమకూరెను. రేయుంబవళ్లు మా హృదయములు ఈ నిక్షేపాన్వేషణమునందె లగ్నమై యుండెను. మాకందఱకిని కొన్ని దినములవఱకును కనులయందును, కలలందును ప్రాఁతసొమ్ములు, బంగరు పెరళ్లును నాట్యము సలుపసాగెను!

"పెరటిసుడి" అను పదసముష్టి దుర్గ్రాహ్యముగ నుండెను. సుళ్లుగోపురములును పెరళ్లలో నుండునా? మా వంశపు వారలకు పిత్రార్జితమగు పెరళ్లు గ్రామమునఁ గలవు. వాని నందు దేవాలయములు లేవు. ఊరఁ గొన్ని సుళ్లు గలవు కాని యవి యిండ్లకు మారమున వీథులలోనుండు నట్టివియే. కావున మా కృషియంతయు వ్యర్థమై, యీ నిక్షేపమునుగుఱించి పరీజాక్షరములెప్పుడును బీజాక్షరములుగనే యుండవలసివచ్చునట్లు తోఁచెను! అంత గ్రామమునఁ బృద్ధులనడుగఁగా, పూర్వమొకప్పుడు ఈ గ్రామము వేఱుప్రదేశమున నుండుచు వచ్చినట్లును, అచట నేదో యొక విప్లవము సంభవింపఁగా, జను లందఱుని లేచివచ్చి, యిక్కడ నూతనగ్రామము నేర్పఱుచుకొని రనియును, చాల కాలము క్రితము వఱకును గ్రామప్రదేశము "పాటిపెరడ"ని వ్యవహరింపఁబడు చుండెననియును దెలిసినది. కాని, యక్కడ సుళ్లేవియును లేవే! నే నొకనాఁడా ప్రదేశమున కేఁగి, పలుదెసలఁ బరికించి చూచితిని. ఎచటను పాడు సుడి జాడలు గానరాకుండెను. అంతట నొక చెట్టుక్రిందఁ గూర్చుండి, యాలోచనలలో మునిఁగియుంటిని. చేరువ నుండి మేఁకలను మేపుచు ముసలిగొల్లవాఁడొకఁడు పోవు చుండఁగా, వానితో ముచ్చటింపఁదొడంగితిని. పాడు

కముపట్టినట్లయ్యె. నిత్యకర్మనిరతుడగు నా యువకుడు కొల్వుకూటమున కేగి యేనాడును ద్విజార్హ కర్మల జేయ మరువకుండెను. అతడు కాల్యకృత్యముల దీర్చుకొని గంగాస్నాన మొనరించుకొని, శుచియై, రాజప్రాసాదపరి సరమార్గమున వచ్చుచుండ నొకనాడు రాజకుమారియగు "దులారీ బీబీ" కంటబడెను. అవివాహితయు, నవయౌవన విలాసవతియునగు నా రాకొమరిత యతనిగాంచి మోహపర వశయై, తన దాసీజనములనుండి యతని వృత్తాంతమెరిగి, నిజే చ్ఛను తలిదండ్రులు గ్రహించునట్లు చేసెను. సులయిమా నది విని కాలచంద్రుని పిలిపించి తనకల్లుని గమ్మని చెప్పెను కాని పరమాస్తికుడగు "రాజా నకిట్టి సంబంధము నచ్చ దట్లునీనయమునను, భయమునను గూడ నా ద్విజుని మొగ్గింప వీలు గావున సులైమాను నలిగి తనయాజ్ఞ నిట్లు ధిక్కరించు కాలచంద్రుని కొరతవేయ నాజ్ఞాపించెను. ఆ బాల్య పరిచితాచార విరుద్ధమగు కార్యమున కొడంబడుటకన్న ప్రాణము లర్పించుట యొక్కువ కాదని తలంచి నిశ్చింతగ రాజాజ్ఞ శిరసావహించి కాలచంద్రు డా రాత్రి చెర కేగి మరునా డురుపు లందుక నుండెను. దులారీ తా వలచిన వా డింతటి కేడు పని విని, యట్టి మహోపకారివిలో నాకొ రకై తానుకూడ పసుపిన ధన్యవనుదునని భావించి మరు నా డుదయమున నె వధ్యభూమికి దానును బోయి తన నిశ్చయమును దలారులకు దెలిపెను. రాజకుమారి యద్వి తీయలావణ్యము, వనివార్య ప్రేమమును, త్యాగశీల్య మును గాంచి కాలచంద్రుని మనసు కరగి, యామెను పరిణయమాడ నొప్పుకొనెను. సుల్తాను ఆనందమునకు మేర లేకుండెను. తాను మహమ్మదీయ మతమును స్వీక రింపకయే కాలచంద్రుడు దులారీ కుమారి పాణిగ్రహిం చెను. కాని లురకబిడ్డను పెండ్లాడిన యాయువకు నెవ్వ రును దరిచేరనీయకుండిరి. రాజాగ్రహమునకు పాత్రులై వధ్యసీమ కేగువాడు రహస్యమునకైన కంట దడిపెట్టిన వ్యక్తులే లే రాతని వనరాని మాటలాడి, పడరాని పాట్లు పెట్ట మొదలిడిరి. సంఘమూరులై వెలిపెట్టబడిన కాలచంద్రునికి రాజానుగ్రహ ముండియు జీవయాత్ర గడపుట దుర్భరమయ్యెను. "ఓయమ్మ, ఓయక్క" యను అమ్మలక్కల గుసగుసలకు, కుమిలి కుళ్లెడు తల్లి కన్నీటి కాల్వలకు తాళలేక, కాలచంద్రుడు నియమితప్రాయ శ్చిత్తములకు లొంగియు, నలయు నన్నివిధులకు తలయొ గ్గియు, సంఘాదరణపాత్రుడు కాలేకపోయెను. ఏరీతినిసం ఘము తన్ననుగ్రహించుమార్గము గానక దీనబంధుడను జగ న్నాథుడే శరణ్యుమని యెంచి అతడు పూరీక్షేత్రమునకేగి, యట నా దేవు నారాధింప దలంచెను. అచటి పూజా రులు కులకళంకితుడని యాతని నటమండి వెడలనడచిరి, వాడు ప్రఖ్యాత హిందూ సార్వభౌముడని వన్నెకె క్కిన ముకుంద దేవ గజపతి పండితసభా మధ్యమున నీకు దక్షిత పహాయము దొరకదని తెల్పిరి.

ఆద్విజాడు కటకపురిని సార్వభౌమదర్శనభాగ్య మబ్బని కారణమున హతాశుడై, వానికై పాంగ్లీతీర మున కేగి, యప్పటను తిరస్కృతుడయ్యెను. భగ్న మనోరథుడగు కాలచంద్రున కింకేదియు దోపక పట్టరా నంత కోపమువచ్చి, తన్నింతగా వేధించుసంఘమును, దాని పూజలందుకొను వేల్పులను రూపుమాపికపేదీర్చుకొన వలయు ననెడికోర్కె పుట్టి అతడు అందులకు తగు యత్నము సేయుచునకట్టెను. వంచులు పరిభవింప కపేదీ ర్చుకొన వాడు చాణక్యుడు ప్రతినపట్టినయట్లు నేడు కాలచంద్రుడును హైందవసంఘ విధ్వంసమునకు దృఢసం కల్ప డయ్యెను.

## 3

బలాధికార సమన్వితుండును, కోరి మాకు నిచ్చి యదిచ్ఛతీతి గారవించినవాడును, తనకేలికయు నగు సుల్తాను సులయిమాను ఇప్పట్లు నిక్రోధమయహృదయు నకు నేకమాత్రశరణ్యముగ గన్పట్టెను. అంతేకాదు. కపేదీర్చుకొని తన పరితప్త హృదయానలమును జల్లా ర్చుకొనుటకు స్వమతమారుడను సుల్తాన్ ఎల్ల విధముల దగిన వాడని యతనికి తోచెను. ద్వేషపూరితమానసమున కాయేలికమత మెంతయు రుచించెను. రాజ్యమేలు రాకొమరిత కేమర మంతగా ప్రేమాంజలిగ త్యాగబుద్ధి బుట్టించెనో, దేమతమర్యాదను సామంతులును, సామా న్యులనుగూడ నంతగా కలపిమెలపి యుండుటకు వీల య్యెనో, ఏమతావలంబులలో నొకని యాధిక్యము నిం

లోకని యుద్ధాసీనతయు తన కేమాత్రము గానరాకుం డెను. అట్టి ముసల్మానులకే కాలచంద్రుని కప్పట్టున పరమానందంబనీయముగ దోచె.

అప్పటి స్థితిని సంశయించుటకును, వేరొండురీతి వర్తించుటకును కాలచంద్రునికి సమయమా? లక్ష్మణతికి చేరినంతనె యాదృఢసంకల్పుడు రాచనగరు కేగి తన నిశ్చితాభిప్రాయమును సుల్తానున కెరింగించెను. సులయిమాన్ అల్లునిలో నిమార్పు గని పరమానందభరితుడయ్యెను. స్వమతమున సుచిత్రరీతిని చేరిన జామాతకు అతడు వలయు సైన్యసహాయము నిచ్చి, విజయుడై రా నాశీర్వదించి, అతనిని ఉత్కళాక్రమణమున కంపెను. అల్లునిచే స్వా తెల్లించుటయు, ప్రఖ్యాతక్షేత్రములను నాక్రమించు టయు నిలవనితిలంపుగ లభింప నెవ్వడు మురియకుండునో!

## ౪

గంగాతీరమున స్వీయసామంకిత ఘట్టసిరాఙ్మా నియుక్తుడై యుత్కళసామ్రాజ్యనేత శ్రీముకుంద దేవ గజపతి ప్రమత్తుడుగ నుండెను. గంగాగోదావరీ మధ్యస్థ ముగు తనరాజ్యమును నిజపరాక్రమమున నెంతయు విస్త రింపజేసి శత్రుభీకరుడనుఖ్యాతిగడించిన యాహిందూప్ర భువు, మొగలు సైన్యాలకు దాడిని సలిపియున్న యుత్తర సీమలనుండి యిట్టిదేమి లేని పిడుగు అనతికాలమునకె తనపై బడునని యెట్లు దలంచియుండును! పటిమ శక్తి పఠానుసామ్రాజ్యము భగ్నమగుటచే.సామంతసీమలు నిజ స్వతంత్రతాస్థాపనకు కృషిసలుపుచు నొండొంటితో గల హించుచుండ,నది తన్నుబోలిన బలవంతునితో గయ్యము నకు కాలుదువ్వునని యాతడు కలనైన నూహింపలేదు. కాని తన రాజ్యసీమను సంఘనిరాదరణ మనుచేసిమిరి నావిర్భవించిన యొక్కద్విజని ద్వేషమేఘము, హుగ్లీనదీ తటమునందలి తన విడిదిలోని పండితమాన్యుల తిరస్కార ణమున చెదరిపోయియు 'గౌడ' రాజాదరణము బలయు తమై యొప్పుచున్నది తిరిగి క్రిందికి దిగి తనను, తనరాజ్య మునుకూడ ముంచివేయుత్తి కుమ్ముకొని పోవునని అతడు కల గనుమెట్లు!

రాజా లేనికటకపురిరాజీచే నెన్నియోదినములు కాపా డబడియు, తుదకు కాలచంద్రునికి కరగతమయ్యెను. కపి తప్ప అన్య మెరుంగని యాకరకుమానిసి విధి విరామము లేక గజపతుల రాచనగరును భీమలపెంటగ జేసి విడి చెను. అనాయాసముగ నింతటి జయము గలిగినందుకు సంతసమున నాతురకసైనికు లుత్సాహపూరితులై రాజ్య మెల్ల కొల్లగొట్టుచు విజృంభించిరి. తా జడిన చిత్తసం క్షోభమున మొరదునారిన కాలచంద్రుని హృదయమున దయాదాక్షిణ్యముల కెచ్చోటను దావు లేకుండెను. నమోలింగక్షేత్రముల కొటించకయు చేజిక్కిన యాహిం దూసామ్రాజ్య ప్రజనెల్ల నాసేనాధిపుడును, సైనికులును కత్తుల కెరజేసివైచిరి. పంటభూముల పెంటకుప్ప లుగ జేసివైచిరి. కలకలలాడు జనపదముల మలమలమాడు మంటల పెట్టివైచిరి. వేయేల? తైమూరుదోపిడివలెనె పొంచాలమైన కొంత విశ్రాంతి నొందగానికాలచంద్రుని దాడి తరువాత నుత్కళము మరి యొదుగుకొనలే దం దురు. అతనిపర్యల జూచినవా రెవ్వరును కాలచంద్రుని "కాలాపహాడ్" అని తప్ప వేరొండు పేర బిలిచి యెరుం గరట! సాధారణముగ ఘోరకృత్యములకు పెనుభీయని అతని సైనికులే యొక్కొక్కతరి అతని సంహారకార్య మును జూచి నిశ్చేష్టులై యిట్టిఘోరములకు పెనుభీయని యీతడును మానవుడేనా? యని సంశయించుచుండిరి.

కటకపురిలోని శ్రీజగన్నాథుని యాలయమును, కోణార్కమును, భువనేశ్వరుని కోవెలయు మొదలుగాగల ఎన్నియో దివ్యక్షేత్రములు కాలాపహాడుకసి కాహుతి యయ్యెను. మహాక్షేత్రముల యాశ్రయులే యాతని కోపా నలమున కింధనము లైరి. క్షేత్రనేతల యాలయములే యాతని ద్వేషాగ్నిని వన్యమందిరములుగ మారె! అనేక పురు షాంతరములనుండి పూజలందెడి మహాసాలగ్రామములె యాతని మూత్రవిసర్జన పాత్రను మురుగవలసివచ్చె. ఏమని వ్రాయను! మాలింతయావు కడుపు కోసి యాచర్మ ముతో మూయబడిన యాతని రణభేరి మ్రోత విని, భయమున శ్రీజగన్నాథుడే పర్వులిడి వచ్చి యాసగడ జనిహాందారిలో ఉన్న మధురాగ్రామములో దాగికొనెనని చెప్పుదురు. నేటికిని ఈమధురలో

నున్న దేవళమున యథాదుపహా వ్యాపనములకు శ్రీజగన్నా
థమునందువోలె భోగరాగాదులు జరుపుదురు. కాళా
పహాడ్ పోయినదాక అట విడిచియుండి పిమ్మట
నామూర్తులు పూరీ చేంచేసినవని చెప్పుదురు.

ఆనాటి తల్లులు తమపిల్లలను కాళాపహాడ్ కిచ్చెద
నని చెప్పి నిద్రపుచ్చెడివారట! ఎంతటి ధీరులును ఆపేరు
వినినంతనే గడగడ వణకుచు తలదాచుకొన చోటడవుల
కైన పరువెత్తిపోయెడివారట! ఆపేరుపెట్టుకొని ఎంత
యోకాలము దుర్మార్గులు తమదౌర్జన్యములనెల్ల నిర్భీతిని
అడ్డులేక జరిపిరట.

ఇట్లు వీరవిహార మొనరించుచు దవనీవు నెల్ల
ధ్వంస మొనరించుచున్న కాళాపహాడు నెదుర్కొని
ముకుంద దేవుడును రణనిహతుడయ్యె. ఇప్పటి కానేగా
క్రమణము పూర్తియయ్యెనని తలచి 'గౌడ' సేనాని
గృహోన్ముఖు డయ్యెను. శ్రోవపాదునకును నీహిందూ
మత ధూమకేతువున కేదియు బన్ధుగమంట వచ్చినది
కాదు. కాని, చిన్నతనమున దిన్నదెచ్చి మాతామహుడు
పెంచి పెద్దచేసిన యోపల్లెలోమాత్ర మాతని సంహార
కార్యమునకు ఒక యాటంకము వచ్చెను. తా నన్యాను
తాపలంబు డైపోయిన వాడతని తల్లిని, భార్యలను మొదటి
మామగారను రాధామోహనుడు గొనివచ్చి తనయింట
పెంచుచుండెను.

నే డాతని విధ్వంసవాంఛ కాగ్రామమున వంత
రాయము గలిగించిన దతనిమాతృమూర్తియే. కొమరుని
రుద్రమూర్తిని గని శోకావిలమానసయై కన్నీరు మున్నీ
రుగా నేడ్చుచు, వెదురుపడు తల్లిని గనినంతనే కాళాప
హాడు స్తంభించిపోయెను. చేష్టలుడిగిన యాతనిరాతి
గుండె నింక నెట్టి పరితాప ముండెనోకాని, వేడినిట్టూర్పు
విడిచి, 'రాజా' ఆపల్లెపై చేయుము చేయిచేసికొనవద్దని
కఠినముగా జెప్పి తిన్నగా లక్నావతికి మరలెను.

యుద్ధపుబడలిక నదలినపిదప మాట్లాడవచ్చునని సు
లైమాన్ అల్లుని విశ్రాంతికి భంగము గావింపలేదు.
కాళాపహాడు విశ్రాంతి దొరకెనోకాని, అహర్నిశము
లాహోరప్పుడలనైన తిన్నగ గానక, అనతికాలమునకె
యాతరు తూర్పునమున్న హిందూరాజ్యములకు అస్సా
(కామరూపము) నందలను వాటిపై దాడివెడ
సుల్తాను సమాజ్ఞ వేడెను. ఎంత బ్రతిమాలినను వినవొల్ల
కాళాపహాడునకు కాదనలేక, సుల్తాను తన సమ్మ
నిచ్చెను.

## ౫

వాడు క్రైమాసములే విధ్వంస మొనరింపబడగా
మిగిలియున్న పఠానుసామ్రాజ్యమును బలాలు లో
యను వారి కేలుచు క్కైన మరల గోలోప్పుయి
ప్రతిష్ఠ వార్జింపధీరప్రయత్నములకేయుచుండెను మా
ఘూర్జరములతో పాటు జానపుర, బంగాళముల
స్వతంత్రసీమలై యుండుటంకేసియు, పనకు రాజులపిదక
ములు రాకుంపుటంజేసియు, బాదుషా సమీపమున నున్న
జానపురపాలకుని లొంగదీయ యత్నించుచుండెను
జానపుర పాలకుడగు బరబక్ష్ ఢిల్లీదాడుల నెదిరించుచు
గాచుకొనుచుండెను. కాశీ, ప్రయాగ, అయోధ్య
మొదలగు ప్రఖ్యాత హిందూక్షేత్రము లెన్నియో గ
జానపురరాజ్య మెప్పటికైన హిందూమత విద్వేషియు
అప్రతిహత శౌర్యరాశియు నగు కాళాపహాడుని కం
బడక తప్పదని బరబక్ష్ గ్రహించెను. అవల ఢిల్లీకి తొ
దుగ వీవల లక్నావతియు దనపై గత్తికట్టిన మనుట క
నని యాతడు తలచెను. కావున యుక్తియు క్రమ
కాళాపహాడునకు ఢిల్లీసార్వభౌముడు తన చేతగాని
మున ముసల్మాన్ ద్వేషులగు హిందువులకు శాంతియు న
పాలనముగ నుండెననియు, నట్టివాని దండించి యర్హు
వాని ఢిల్లీ సామ్రాజ్యసింహాసనమధిష్ఠింపజేయుటధర్మమనియు
ముసల్మానుల గౌరవప్రతిష్ఠల గాపాడుట తన య
ధీరునకు దగినపనియనియు కబురంపెను! బరబక్ష్ యొ
నము చాలకించి కాళాపహాడు జానపురమునకు బ
మయ్యెను.

ఈసమాచార మెరిగి బలాల్ లోడీ, కాళాప
డును జానపుర మేగి బరబక్షను ఎట్లయిన కలియ
జేసి, శ్రోవ గాచి వానిని ఢిల్లీకి దోడ్కొనిరా నిశ్చ
నను తన మంత్రి సయ్యదునువానికి చేయుసైనికుల స

పంపెను. చతురమతియగు సయ్యదు నదీతీరమున కాలా
పహాడు రాకకై వేచి, యాతడు వచ్చు వఱకు జాన్పుర
ప్రాంతము చేరకుండగనె సమీపించి తానె బరబక్షా
పంపిన దూతనని తెలిపి, కాలాపహాడునకు రహస్యముగ
"ఢిల్లీ సేన లసంఖ్యాకములుగ వచ్చి త్రోవగాచి యున్న
దనియెఱిగి, బరబక్ మిమ్ము పదిమంది సైనికులతోడ నావ
నవల విడిచి చాటుబాట పల్లకిలో రమ్మనుమని వేడ
బంపె" నని చెప్పెను. కాలాపహాడున కింతటి వెరపొందవల
సిన యవసర మంతగ గానరాకున్నను, బరబక్షాకోర్కె
దీర్పరానిదని అతనికి తోచెను. కాని యాడుదానివలె
నతడు పల్లకినెక్కిపోవుటకు సమ్మతింపక నమ్మినబంట్లు
పదిమందితోడ నశ్వారూఢుడై సయ్యదు ననుసరించెను.
అతనికి గాని, యాతని 'గాఢయోధులకు గాని యామంత్రి
గొంపోయెడి త్రోవయే తెలియదయ్యెను. మైత్రి
వాంఛింపు బలాలులోడీ చేయు సన్మానములవలనను,
అతనిమంత్రి సంభాషణముల వలనను శాసంగనేతానికి
పఠానుల ద్రోహము గ్రహింప నిసుమంతయు వీలు కలుగ
దయ్యె. సయ్యదు చేయు సపర్యల సంతృప్తుడైన కాలా
పహాడు ఢిల్లీ చేరి నిజ మెరిగినపిమ్మట బాదుషా చేసిన
ద్రోహమున కతని నిందింప సాహసింపకుండెను. సామ్రా
జ్యనేతయగు లోడీయు కాలాపహాడునకు నిందింప నవ
కాశ మీయక, ప్రఖ్యాతయోధుడగు నాతనిం దనకొసు
రీతి వలచియున్న కారణమున నిట్లు మోసగించితిననియు,
క్షమించి మన్నింప వలయుననియు చెప్ప నాతడు మారు
మాటాడలేకుండెను.

పెండ్లికుమారుడై స్వమాతృమున్న వేళ వందుచు
మనుగుడుపు లారగించుచు గూర్చుండుటకు కాలాపహాడు
నకు మనము నిలుచు టెట్లు? తన్నంతగ పరాభవించిన
హిందూసంఘము నింక నంతగ మిగిలి ప్రబలియుండ నా
క్రోధమూర్తి మానసమునకు శాంతి చేకూరు టెట్లు?

కాలాపహాడునకు విశ్రాంతిగొన వాంఛ గలిగినను,
జాన్పుర విధ్వంసవాంఛను తన కొమార్తె నాతనికిచ్చి పెం
డ్లి చేసిన బల్లాల్లోడీ మిన్నకుండు టెట్లు! జాన్పురపాలకా
దరణమున హాయిగనున్న హిందూమహాక్షేత్రములపై
కాలాపహాడుని దృష్టి మరల్చుటకు ఢిల్లీ సామ్రాజ్యాంగవేత్తల
కంత కష్ట మనిపింపలేదు. సామ్రాజ్య సేనావాహిని
కధినేతయై సార్వభౌముని జామాత మరల దహనమారణ
క్రియలకు మొదలిడెను. ఉత్కళ సంహారమూర్తి కామ
రూపాదిసీమల వైభవము మట్టిలో కలిపిన పదాఘాత
మున నార్యావర్తమున గల హిందూజాతి కెల్ల నంత్య
కాల మాసన్నమైనట్టుల తోచెను. తా నొకటి దలప
దైవ మొకటి చేసెనే యని విలపించుచు బరబక్షా
యుద్ధభూమిని ప్రాణము లర్పించెను. గయ, ప్రయాగ,
అయోధ్య మొదలుగాగల ప్రఖ్యాతపావనభూముల దునుల
జెట్టి కాలాపహాడు కాశీ జేరెను. అట వారణాసి సైనికులు
విచ్చలవిడి చెలరేగి ఆబాలగోపాల మెల్లర మానప్రాణముల
గొనజొచ్చిరి. కాలాపహాడు అటగల దివ్యాలయముల నేక
ముల జొచ్చి, లోని విగ్రహముల నెల్ల ధ్వంస మొనరించి,
తుట్టతుదకు విశ్వేశ్వ రాలయమున జొర నుంకించెను.
కాని యాయాలయద్వారము చెంగటి కేగుసరికి నొక స్త్రీ
వ్యక్తి "ఆకులకళంకు డేడీ? ఆకులపాంసను డేడీ!" యని
గద్దించుచు, దండతాడిత భుజంగంబువోలె కోపించుచు రివ్వున
వచ్చి యాతని వామహస్తము బట్టి నిలువబెట్టి, వలయు
వంతగ దిట్టి, "నన్ను స్మరించితివే? ఏనాడు నాయన్న
కడుపు చెరుప బుట్టితివో యానాడే యింతటి చండా
లుడ వౌదువని యెఱింగిన, అల్లారుముద్దుగ పెంచి లాలిం
చిన నా యీచేతులనె నీ యసువుల గొనియుందును.
మాన గండైనది. కులప్రదీపకుడవని యెంచి పెంచిననీవు
కులకళంకుడవైతి వేమిరా? నీతండ్రితో బుట్టి నా
దానినై శ్రీవిశ్వేశ్వరు సేవించుచు పవిత్ర కాలము గడ
పనెంచిన నన్నీ దివ్యక్షేత్రమునగూడ బడియుండనీక,
నీరాకాసిమూకలు పరిభవింప గంగగర్భము జొచ్చి
యాత్మహత్య జేసుకొన జూడవచ్చిన ప్రతాపవంతుడవు:
ఇకనైన సంతసించు! మాతుల విడ్చి నీచే నిచ్చు వచ్చిన
దాస్యము చేయించుకొని యింట గూర్చుండి గునియు
మామలకు ఇకపోయి నీప్రతాపవిశేషములు నచ్చుజెప్పు.
తురకలమూకల సాంగత్యమునకై మాతాపితరుల మతిమర్యా
దలను మంటబెట్టిన మానహీనుని మహమ్మదీయస్వర్గ
మైన నెట్లు చేరరానిచ్చు ననుకొనుచుంటివి? పాపమ్ము!
పాపీ! పాపమ్ము!!" అనుచు, నిశ్చేష్టుడై స్తంభించి యున్న

చూచుచున్న కాళాపహాడును వదలి పడిపడిబోయి గంగా నదీగర్భమున జొచ్చెను. అప్పటికి నా సేనాధిపుడు తేరుకొనలేదు. ఆవిశ్వేశ్వరాలయద్వారసన్నిధిని కొయ్యబొమ్మవలె నిలిచి నిలిచి, తన్నట్లు మందలించి పోయిన కోపాయతనేత్రజాడనే చూచిచూచి, యేరును వెరచి తన్ను చేరరాని కారణమున గొంతవడికి దనకు దాన తెప్పిరిల్లి, కాళాపహాడు మారుమాటాడకుండ వన విడిదిగుడారమున కేగి తెర వైచుకొనెను.

౬

మరునా డుదయమున సేవకు డెట్టకేలకు సాహ సించి గుడారములోని కేగ, కాళాపహాడు మరిగా రాడయ్యె; ఏమయ్యెనో అకాలమాత్రికే యెరుక లోడిరాకుమారి గర్భమున గలిగిన ఘాతిమా తప్ప వేర సంతానమును బడయకయె కాళాపహాడు అంతర్ధా నమయ్యెను. సుల్తాను రాజనీతియో, కాశీదేవాలయార కుల నైపుణ్యమో, లేక మేనత్తమందలింపువేసిమియో యాతని కథావశేషుని జేసెను.

---

# పారిజాతము

చిర్రావూరు కామేశ్వరరావు గారు

తరుణశాఖాగ్రమునఁజక్కఁదనము లొలుకు
 పరమసుకుమార నాట్యసుందరివి నీవు
పారిజాతమా! సౌందర్యభాగ్య మెల్లఁ
జూఱఁగొంటివి, నినువంటిచోద్య మేది?

వలపు ప్రసరించి వెన్నెలతళుకునందుఁ
గలికితన మొల్కు నీ సోయగము నుతింపఁ
బలుకుచేరుపు నా కలవడఁగ లేదు:—
భరతశాస్త్రము నీ కేరు గఱపినారు?

పరమనిశ్శబ్దసంగీత వరము నీ కె
వఁడు ప్రసాదించె?—ఎంతటి భాగ్యవతివి!

మలయమారుత వీచిక లొలయునపుడు
తెల్లనవ్వులమో మటు ద్రిప్పి, చంద్ర
కాంతిలో దాఁగి యిసుమంత గానఁబడవు!
నీవు తెచ్చిన దివ్యసందేశ మేమి?

అవధి లేదె, మనోహరమైన నీవి
లాస విన్యాస యుత మృదుహాసమునకు?—

బేల! ఈ పరమానందలీల లెల్ల
అంతరించిపోవు నని నీయాత్మ కెఱుక
లేదె?—తెల్లవాఱినయంత లెక్క లేని
చక్కఁదనములు ధూళిధూసరితము లగు!

---

# ఇంద్రవర్మ తామ్రశాసనమా?

రాళ్లబండి సుబ్బారావుగారు, యం. ఏ., యల్. టి.

గడచిన ఆషాఢమాసపు భారతిలో "అనంతవర్మ కుమారుడగు ఇంద్రవర్మయొక్క తామ్రశాసనము" అను పేరిట వ్యాసమొకటి ప్రకటింపబడినది. ఈశాసనపు ప్రతిబింబములను గడచిన సం. డిసెంబరునెలలో టెక్కలిజమీందారుగారగు శ్రీ యల్. యస్. దేవు గారు నాకు పంపి దాని పాఠములను వారికి పంపగోరిరి. అట్లే చేసితిని. తర్వాత పర్లాకిమిడి నివాసులగు సత్యనారాయణరాజ గురువుగారు "నందవర్మ పాంతో కొంవాలి తామ్రశాసనము" అను పేరిట ఇదే శాసనపు ప్రతిబింబములను, పాఠములను వ్రాసి పంపి, ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలివారి ఆంగ్ల త్రైమాసికపత్రికయందు ప్రకటింప కోరిరి. అట్లే అవి ప్రకటింపబడినవి. * ఆషాఢమాసపు భారతియందు నాపాఠములను తెలుగున ప్రకటింప యత్నించితిని. కాని వీలు లేకపోయెను. అయినను శ్రీరాజావారే ఆ శాసనమును ప్రకటింపగా జదివితిని. అనేక విషయములందు మాకు అభిప్రాయభేదము లుండుటచేతను, శాసనపు ప్రతిబింబములందలి విషయములును, ప్రకటింపబడిన పాఠములును అనేకచోట్ల సరిగాకపోవుటచేతను తిరిగి నా వ్యాసములోని కొంతభాగమును ప్రకటించి నా పాఠములను, నాకును, శ్రీ రాజావారికిని గల అభిప్రాయభేదములను ఈక్రింద పొందుపరచుచున్నాను. ఈ శాసనముయొక్క ఆకారాదివిషయములు, లిపి, భాష మొదలగువానిని గురించి తిరిగి వ్రాయ నక్కరలేదు. కాని శాసనమునందలి భాషనుగురించి కొన్నివిషయములు మాత్రము వ్రాసెదను.

చిట్టచివరనున్న రెండువ్యాసగీతములు తప్ప, మిగిలిన శాసనమంతయు గద్యరూపమున నున్నది. 'ల' కారమునకున్ను, 'ళ' కారమునకున్ను భేదా లేదు. ప్రస్తుతము మనము అనుస్వార ముపయోగించు నెడల శాసనమునందు అనునాసికమే లిఖింపబడినది. ఇందులకు ఉదాహరణములు:—కళిఙ్గ, మహీన్ద్రి, శశాఙ్క, కలఙ్క, తరఙ్గ, మఞ్జరీ, పుఞ్జ, రఞ్జిక, శ్రీమానన్దవర్మ.— మరియు "సంవత్సర" అని వ్రాయుటకు బదులుగా శాసనమునందు "సంవచ్ఛర" అని ప్రాకృతపదము వాడబడినది. "వ" "బ" లకు భేదము లేకుండుటయు, ఉండవలసినచోట్ల అనుస్వారముగాని, విసర్గగాని, సంధిగాని యుంచకపోవుటయు ఈశాసనపుభాషయం దితర విశేషములు.

## శాసనవృత్తాంతము

ఈశాసనము పూర్వగాంగవంశజుడును, శ్రీ అనంతవర్మసూనుడును అగు శ్రీమానన్దవర్మ మహారాజుదై యున్నది. పూర్వగాంగవంశపు రాజుల బిరుదములన్నియు ఇందునూ గలవు. ఈరాజు తన పరిపాలనమునందున్న "చిఖల్లిక" గ్రామనివాసులగు భోగిక (ఆదాయపువసూలు చేసేవారు) వారికి (వీటి తీరువా వసూలుచేసేవారు) ప్రముఖులందరిని సమకూర్చి కుటుంబినులను (వ్యవసాయదారులను) ఆజ్ఞాపించుట ఏమనగా:—"మీకు తెలియబడుగాక! శ్రీమానన్దవర్మనైన మేము ఈ(చిఖల్లిక) గ్రామమునందు సూర్యగ్రహణకాలమందు (మా) పుణ్యాభివృద్ధికొరకు రాజపుత్రుడైన 'ఖారి' అను పేరుగలవాని (సమక్షమున) 'ధూపత్రక' నివేశనసహితముగను, కౌండిన్యస గోత్రులున్ను, బ్రాహ్మణులున్ను అగు ఆదిత్యశర్మ, మాతృశర్మ, దుర్గశర్మలకు సర్వవిధములైన పన్నులు, ఇతర ఆటంకములు తప్పించి ఆచంద్రార్క స్థాయిగా ఇవ్వబడినది."

* ఆం. ఇ. ప. మం. వారి త్రైమాసికపత్రిక రెండవసంపుటము, 3, 4, సంచికలు, 185-188 పుటలు చూడుడు.

దానమిచ్చిన భూమియొక్క పరిహద్దులు ఈక్రింది విధముగా చెప్పబడినవి:—తూర్పు, కోల్లంగి యను పేరుగల పరిహద్దు. దక్షిణం, దక్షిణముగా పారుచున్న (కాలువ) దక్షిణపుపరిహద్దు. పశ్చిమదక్షిణమూల పాషాణము. పశ్చిమం చిందుదుకావి. ఉత్తర పశ్చిమమూల పాషాణము. ఉత్తరమున కాలువ తూర్పుగా పారుచున్నది.

రాజులకు ఆజ్ఞాపించుట ఏమనగా:—

“శ్రీరాజులారా! ఇతరులు (దానము) ఇచ్చినారని, ఫలంలేదని సందేహింపవద్దు. ఇతరులు దానంచేసిన దానిని రక్షించుట స్వదానఫలంకన్న హెచ్చు. సగరాది చక్రవర్తులు అనేకమంది భూమిని దానంచేసినారు. ఎప్పుడు ఎవరికి భూమి దానంచేస్తే, అప్పుడు వారికి అంతఫలం.”

## దానముచేసిన గ్రామము

దానముచేసిన “చిఖల్లిక” యను గ్రామమిప్పుడు “చిక్కాలవలస” యను గ్రామమై యుండును. ఇది గంజాం జిల్లాలోని ఉర్లాం గ్రామమునకు సమీపమునన్నది.

## శాసనకాలనిర్ణయము

శాసనకాలము “ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరశతే, 221” అని నిర్ణయింపబడినది. ఆంధ్రదేశేతిహాస పరిశోధకమండలివారి త్రైమాసికపత్రిక, రెండవసంపుటము, రెండవభాగమున, 153 పుటలో ఈశాసన కాలము “ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరశతే” అనియు, అనగా, గాంగేయశకము 100 సంవత్సరము లని, వ్రాసియుంటిని. అప్పుడు శాసనకాలమును తెలుపు సున్నను శాసనాంతపు చిహ్నముగా భావించియుంటిని. కాని దానినిగురించి సందేహము తీరక, చెక్కిలిజమీందారుగారికి వ్రాయగా, వారు అది 221 అని వ్రాసి పంపిరి. శ్రీ సత్యనారాయణరాజు గురువుగారును వారి వ్యాసమున అట్లే వ్రాసిపంపిరి. కనుక ఇదివరలో నేను సూచించిన యభిప్రాయమును మార్చుకొని ఈశాసనము యొక్క కాలము గాంగేయశకము 221 గా భావించెదను.

## ఈశాసనకర్త ఎవరు?

183, 195 గాంగేయశక సంవత్సరములలో గుణార్ణవుని కొడుకు దేవేంద్రవర్మ రెండుదానశాసనముల నిచ్చెను. అతనికి జయవర్మ, అనంతవర్మయని ఇరువురు కొమాళ్లు. అందు అనంతవర్మ 204 గాంగేయశక సంవత్సరములో అగ్రసోదరుడైన జయవర్మసలహాపైని వివాహసమయమునందు క్రోష్టుకవర్తనియందలి శాకత్తేరియను గ్రామమును కామరూపవిషయ నివాసియగు విష్ణుసోమాచార్యునకు దానముచేసెను. ఇతని కొమారుడొకడు దేవేంద్రవర్మ యనువతడు 251, 254 గాంగేయశకసంవత్సరములలో దానములుచేసెను. ప్రస్తుతపు శాసనకర్తయగు మహారాజ శ్రీ మానవ్దవర్మ 221 సంవత్సరములో దానము చేయుటవలన 204 గాం. శ. సం. న దానముచేసిన అనంతవర్మయొక్క జ్యేష్ఠకుమారుడును, 251,254 గాం. శ. సం. లలో దానములుచేసిన శ్రీదేవేంద్రవర్మకు జ్యేష్ఠ సోదరుడును కావలెను. శ్రీమానవ్దవర్మయు, శ్రీదేవేంద్రవర్మయు శ్రీఅనంతవర్మ మహారాజుయొక్క కొడుకులే. ఈశాసనమునందు రెండుచోట్ల రాజుయొక్క పేరు “శ్రీమానవ్దవర్మ” యనియే యున్నది. అయినను శ్రీసత్యనారాయణ రాజుగురువుగారు “శ్రీమాన్‌నన్దవర్మ” యని యుండవలెననియు, శ్రీమాన్ అనుచోట నకారపు పొల్లు లేఖకుని పొరపాటువల్ల లోపించినదనియు అభిప్రాయపడిరి.* శ్రీ చెక్కిలి జమీందారుగారు నేను పైని చదివిన పాఠము తప్పనియు, “శ్రీమానింద్రవర్మ” యని యుండవలెననియు, సంధి విడదీయునప్పుడు శ్రీమాన్ + ఇంద్రవర్మ యగునవియు తెలిపియున్నారు.† కాని, పై యభిప్రాయములు సరియైనవి కావనియు, లేఖక ప్రమాదములు రెండుచోట్ల దాతయగు రాజు పేరు వ్రాయునప్పుడు జరుగనేరవనియు, శాసనాధార

---

* ఆంధ్రదేశేతిహాస పరిశోధకమండలి త్రైమాసిక పత్రిక రెండవసంపుటము, మూడు నాల్గు సంచికలు, 185–188 పుటలు.

† భారతి విభవ సం. ఆషాఢమాసము, 111–116 పుటలు.

మనుపట్టి "శ్రీమానన్తవర్మ" యనియే చదువవలసియుండునదియే నా అభిప్రాయము. మరియు ఇదివరకు నేను చదివిన పూర్వగాంగరాజుల శాసనములలో "శ్రీమాన్" అను బిరుదము కనబడలేదు. "శ్రీ" అని మాత్రము వ్రాయుట కలదు. "శ్రీమానన్తవర్మ" యనియే శాసనమునందు రెండుచోట్ల స్పష్టముగా నున్నను, శ్రీ యుత్. యస్. హరిచందన జగద్దేవ రాజాబహద్దూర్ వారు శ్రీమాన్ + ఇంద్రవర్మ యని చదువుటకు గల కారణమేమో? చదువరుల యుపయోగార్థమై నేను చదువగల్గినరీతిని మూలమును తిరిగి వ్రాసినాను. ఇదివరలో శ్రీ రాజావారు ఆషాఢ భారతియందు ఇచ్చిన శాసనపు మూలమునకును, దీనికిని చాలా భేదాలు గలవు. పై భారతియందివ్వబడిన శాసనపు ప్రతిబింబములను చూడదగును.

## మూ ల ము *

### మొదటరేకు : రెండవపక్క

౧. ఓం[1]స్వస్త్యమరపురానుకారిణ[2]సర్వర్తుసుఖరమణీయా
౨. ద్విజయవత (శ్రీ) కలిఙ్గనగరావాసకా[3]న్మహేన్ద్రాచలా
౩. మలశిఖరప్రతిష్ఠితస్య[4] చరాచరగురోః సకల[5]
౪. భువననిర్మాణైకసూత్రధారస్య శశాఙ్కచూడా[6]
౫. మణేర్భగవతో గోకర్ణస్వామినశ్చరణకమ
౬. లయుగలప్రణామాదపాస్తసకలకలికలఙ్కో
౭. గంగామలకులోద్భవనిజనిస్త్రిం[7]శధారోపార్జితసక
౮. లకలిఙ్గాధిరాజ్యప్రవితత చతురుదధితరఙ్గమేఖ

### రెండవరేకు : మొదటిపక్క

౯. లావనితలామలయశా అనేకోనంతో[8] భజని
౧౦. తవిజయశబ్దః ప్రతాపావనతసమస్తసామన్తచక్ర
౧౧. చూడామణి ప్రభామఞ్జరీపుఞ్జరఞ్జితచరణపర
౧౨. మమాహేశ్వరో మాతాపితృపాదానుధ్యాతో నయవి
౧౩. నయదయాదాక్షిణ్య శౌర్యౌదార్య సత్యత్యాగా
౧౪. దిగుణసంపదామాధార (శ్రీ) అనన్తవర్మసూనుమహారా

---

* నావద్దనున్న శాసనపు ప్రతిబింబములనుంచి వ్రాయబడినది. 1. శంఖమునంటి గుర్తు చే చూపబడినది. 2. కారిణః అని చదువవలెను. 3. వాసకాత్ అని. 4. ప్రతిష్ఠితస్య అని. 5. సకలోన్వకల అని. 6. చూడా అని. 7. నిస్త్రింశ అని. 8. యశానేక అని.

౧౫. జశ్రీమానన్దవర్మణ ఫరేయభుక్తేః పాతిచిఖల్లికాగ్రా

౧౬. మసినో[9]భోగికవారిక ప్రముఖసర్వసమవేతాం

రెండవ రేకు : రెండవ పక్క

౧౭. కుమ్బిన[10]సమాజ్ఞాపయతి విదితమస్తువోయథాస్మిన్గ్రా

౧౮. మే[11]స్మాభిశ్శ్రీమానన్దవర్మణః సూర్యోపరాగే పుణ్యాభివృ

౧౯. ద్ధయే రాజపుత్రఖాలినామాభూపటకః నివేశ

౨౦. ననహితా కపిలమణ్డపయమలేపోల్లవిత

౨౧. కౌసన్డిల్య[12]సగోత్రాయ భ్రాహ్మణాదిత్యశర్మణే మాతృ

౨౨. శర్మణే దుగ్గశర్మణేచ సర్వకరభరైః పరిహృత్యా

౨౩. చన్ద్రార్క ప్రతిష్ఠప్రతిపాదిత ఇతి పూర్వేణ దోల్లంగినామ

మూడవ రేకు : మొదటిపక్క

౨౪. గర్తా సీమాసీతు దక్షిణేనప్రవహతి దక్షిణేనసీమా

౨౫. సేతుపశ్చిమదక్షిణకోణే పాషాణ పశ్చిమేణవాపీ

౨౬. ఉత్తరపశ్చిమకోణే పాషాణఉత్తరేణకాణగర్తాపు

౨౭. ర్వేణ ప్రవహతిరాజ్ఞః ప్రజ్ఞాపయతి మాభూద

౨౮. ఫలశఙ్కావః పరదత్తేతిపార్థివాస్వదానాఫల[13]

౨౯. మానస్త్య[14] పరదానానుపాలనం బహుభిర్వసుధాదత్తారాజా

౩౦. భి[15] సగరాదిభి[16] యస్యయస్యయదాభూమితస్యతస్య

౩౧. తదాఫలమితి ప్రవర్ధమానవిజయరాజ్యసంవచ్ఛర[17] శతే ౨౨౧

౩౨. ఆషాఢదినపఞ్చమి ఉత్కీర్ణ[18] శాసన[19]

---

9. గ్రామవాసినో అని. 10. కుటుంబినః అని. 11. యథాస్మి న్గ్రామే అని. 12. కౌన్డిన్య అని. 13. స్వ[illegible] దాత్ ఫల అని. 14. మానత్త్వం అని. 15. రాజాభిః 16 సగరాదిభిః. 17. సంవత్సర అని. 18. ఉత్కీ[illegible] అని. 19. శాసనం అని.

# చ్యుతి

విశ్వనాథ సత్యనారాయణ గారు

ఇది పరాముక్త మగుచు నాయెడ జనించి
తావకాలయ ఘంటికాధ్వానపథము
లందఁ బడి యాత్రవీథుల యందు తెలుఁగు
తలఁపు—వేకింపఁబడెద విశ్వంబు నాథ!

నీగుడి ప్రమాణమును చేరనీక తరిమి
నారు భస్మధారు లగు పూజారివారు
నా వదనసీమ బత్తి యున్నది కనంబ
డదఁట! నావంటివారు కూడరఁట యచట!

నీదుగుడి వెన్కతట్టున నేల కొరిగి
పోవుచున్న ప్రాకారపు వారియ దాఁగి
యాలయపురఃప్రలంబి ఘంటారవములు
వినుటపై మానసము నిల్పి వేచి యుంటి.

అనినాదంబు లేగగనానిలములు
మోచుకొనిపోయెనో! కాక నా చెవులకు
చెప్పరాని వినరాని చేటు కలిగె
నో! ప్రతీక్ష ప్రతీక్షగా నుండిపోతి.

అనినాదాల కంకితమైన నాకు
కేదగుండె ఆప్రమోదశీలు వినుట యనున
కలదో! ఏనాటికైన ఈ గండశిలల
యందు నేఁగూడ నొకశిల యగుదునో! కాక.

---

# ప్రాచీన జ్యోతిష గ్రంథములు*

నిడుమోలు కనకసుందరంగారు, బి.ఏ. (ఆనర్సు)

## నక్షత్రములు

సూర్యుడు సంచారమొనర్చెడి క్రాంతివృత్తము (Ecliptic) ఇరువదియేడు లేక యిరువదియెనిమిది భాగములుగ విభజింపబడి యందొక్కొక్క భాగమున కొక్కొక నక్షత్రముయొక్క పేరు పెట్టబడెనని ప్రాచీన గ్రంథములందు కానవచ్చుచున్నది. నక్షత్రములు చంద్రుని రాసులని కొన్నిచోట్ల నుదాహరింపబడి యున్నది. అవి సోముని—అనగా, చంద్రుని—భార్యలని మహాభారతము [ IX-35 (45) ] ను, తైత్తిరీయసంహిత [ii-3 (5)] యును చెప్పుచున్నవి. ఋగ్వేదమునందు తిష్య (సూర్యుడు?), అఘాస్ (మఘ), అర్జుని (ఫల్గుని) నక్షత్రములు తప్ప నింకేమియు కనుపడుటలేదని యింతకు పూర్వమే వివరించి యున్నాము. 1 వ అధ్యాయము 162 (18) ఋక్కునందు 27 నక్షత్రములకు సూచన యున్నదని కొందరు వ్యాఖ్యాతలు తలచుచున్నారు. అథర్వవేదము [XIX-7], తైత్తిరీయసంహిత [IV-4-10], కథాసంహిత [XXXIX-13 ], మైత్రాయణీ సంహిత [ii-13 (20)], శతపథబ్రాహ్మణము [X.5-4, 5 (5)] మొదలగు గ్రంథములును నక్షత్రనామములను వివరించి యున్నవి. ఈపేర్లలో వ్యత్యాసములు అరుదుగా నున్నవి. కాని నక్షత్రసంఖ్య మాత్రము కొన్నిటియందు 27 గను, మరి కొన్నిటియందు 28 గను నున్నది. అథర్వవేదమును, మైత్రాయణీసంహితయును 28 నక్షత్రములను పేర్కొనుచున్నవి. తైత్తిరీయ సంహిత, శతపథబ్రాహ్మణము మొదలగునవి 27 నక్షత్రములను మాత్రమే పేర్కొని యున్నవి. వేదకాలానంతర గ్రంథములుకూడ నక్షత్రములు 27 అని కొన్నియు, 28 అని మరికొన్నియు తెలుపుచున్నవి. జ్యోతిష వేదాంగము, సూర్యసిద్ధాంతము [ii-64]లందు 27 మాత్రమే కలవు. సూర్యప్రజ్ఞప్తి, బ్రహ్మస్ఫుటసిద్ధాంతము, సూర్యసిద్ధాంతము [ VIII-I-f ] లందు 28 యున్నవి. కావున ఆదిని 27 ఉండెనో, 28 ఉండెనో, యిదమిత్థమని చెప్పజాలము. ఈ యిరువది యెనిమిదవ నక్షత్రము అభిజిత్తు అయి యుండవలెనని జ్యోతిష్కులు అభిప్రాయ పడుచున్నారు. అభిజిన్నక్షత్రము తారావర్గములోనుండి తొలగిపోయెనని మహాభారతము [III-230-11] న విచిత్రమగు నొక గాథ కలదు. కాని ఇది నక్షత్రవర్గములో వచ్చిచేరిన నూతననక్షత్రమని తైత్తిరీయ బ్రాహ్మణము[i-5-2 (3)] తెలుపుచున్నది. కావున ఆదిని నక్షత్రములు 27 గా నుండి తైత్తిరీయబ్రాహ్మణమునందు వివరింపబడిన రీతిని అభిజిన్నక్షత్రముయొక్క ఆగమనమువలన 28 అయ్యెనో, లేక ఆదినే 28 గా నుండి మహాభారతము నందున్నటుల అభిజిత్తు జారిపోవుటచే 27 అయ్యెనో నిర్ణయింపజాలము. అరేబియా దేశీయుల మనాజీల్ నందును, చైనా దేశీయుల సియూ (Sieou) నందును, బాల్డియనుల గణితమునందును 28 నక్షత్రరాసులే కనబడుచున్నవి. వానికిని హైందవ జ్యోతిశ్శాస్త్రము నందలి నక్షత్రరాసులకును గల సంబంధమును గూర్చి అనేక వివాదములు ప్రబలియున్నవి.

నక్షత్రములసంఖ్య యిట్లు భేదించుటకు గల కారణమును ఎవరును ఇంతవరకు నిర్ణయించి యుండలేదు. పూర్వకాలమున అభిజిత్తును విడిచి, 27 నక్షత్రములనే వాడుకొనుచుండిరని పెక్కుమంది శాస్త్రజ్ఞులు ఊహించుచున్నారు. 3 సంఖ్యను 3 సార్లు పెంచిన 27 వచ్చుచున్నది. కావున నీసంఖ్యయందు కొంతగూడార్థముం

* ఈవ్యాసముయొక్క ప్రథమభాగము ఆషాఢమాస సంచికయందున్నది.

యుండవచ్చును. పూజాపీఠమును 756 ఇటుకలతో కట్టవలెనని శతపథ బ్రాహ్మణము [X-5-4 (5)] విధించు చున్నది. ఈ సంఖ్య 27 ను 28 చే గుణింపగా వచ్చున దగుటచే నిందును ఏదో విశేష ముండెనేమో యను అపోహము కలుగుచున్నది. నక్షత్ర నామములలో నింకొక విశేషమును మనము గమనింపవలసి యున్నది. 27 లేక 28 నక్షత్రములలోను పూర్వోత్తర ఫల్గుణీ, పూర్వోత్తరాషాఢ, పూర్వోత్తరాభాద్ర పదములను కూడదీసిన యెడల 24 లేక 25 ప్రత్యేక నామములు మాత్రమే కనబడుచున్నవి. హిందువులు మొట్టమొదట క్రాంతి వృత్తమును 6 భాగములుగా విభజించి యుండిరేమో యని అల్బిరూని అనుమానపడి యున్నాడు. [ఇండియా, i. 358 పేజీ చూ.] ఈ 6 భాగములును తరుపరి 12 రాసులుగా మారినట్లే, ఈ 12 రాసులును 24 అర్ధరాసులు (హోరలు) గా మారి ప్రత్యేకనక్షత్ర నామములను గ్రహించి యుండవచ్చుననియెడి వేరొక అపోహమునకు కూడ తావు కలదు. అదియేగాక, పూర్ణిమయందు సుమారుగా చంద్రు డేనక్షత్రమునం దుండునో ఆనక్షత్ర నామమునుండియే మాసనామము సంక్రమించి యుండి నందువలన నీయపోహమునకు కొంత ఆధారము ఏర్పడు చున్నది. నక్షత్రనామములకును, మాసనామములకును గల సన్నిహిత సంబంధము ప్రత్యక్షముగ నగుపించుచునే యున్నది. చైత్రము—చిత్ర; వైశాఖము—విశాఖ; జ్యేష్ఠము—జ్యేష్ఠ; ఆషాఢము—ఆషాఢ; శ్రావణము—శ్రవణము; భాద్రపదము—భాద్ర; ఆశ్వయుజము—అశ్విని కార్తికము—కృత్తిక; మార్గశిరము—మృగశిర; పుష్యము—పుష్యమి; మాఘము—మఘ; ఫాల్గునము—ఫల్గుని.

నక్షత్రములు ఆకాశమున నుండు స్థానములను పూర్వగ్రంథము లెవ్వియు సూచించి యుండలేదు. వరాహమిహిరుని కాలమునాటి దైనను (క్రీ. శ. 6 వ శతాబ్దము) ఈ విషయమున నుపయోగ కరములగు సూత నాంశము లెవ్వియు లభింపలేదు. పంచసిద్ధాంతికము నందు ఏడునక్షత్రములకు మాత్రము యోగతారలు సూచింపబడి యున్నవి. కాని యివియైనను నిర్దుష్టముగ నున్నవని చెప్పుటకు వీలులేదు. ఈ నక్షత్రముల స్థానములను స్పష్టముగా నిర్ణయించుటకు మనపూర్వికులు పూనుకొని యుండినట్లగపడుట లేదు. అల్బిరూని [ఇండియా, II, 83] యిటుల వ్రాసియుండెను: "స్థిరనక్షత్రములను గూర్చి హిందువులకు బొత్తిగా తెలియదు. చంద్రస్థానములైన యోగతారలను గుర్తించి, వ్రేలితో నాకు చూపగలిగినవా రెవరును నాకు తటస్థముకాలేదు." సూర్యచంద్రుల సంచారమార్గము నాధారము చేసికొని ప్రాచీనగ్రంథములు నక్షత్ర స్థానములను నిర్ణయించు చున్నవి. ప్రతినక్షత్రమునందును యోగతారలస్థానము నిర్ణయింప వలసియుండెను. పంచసిద్ధాంతికమున చెప్పబడిన యేడునక్షత్రముల స్థానములు నిట్లు వర్ణింపబడి యున్నవి: "కృత్తికయొక్క యోగతార ఆరవఅంశకు చివరను, క్రాంతివృత్తమున కుత్తరమున మూడున్నర 'హస్తముల' దూరమున నున్నది. రోహిణియొక్క యోగతార యెనిమిదవ అంశతుదిని, క్రాంతివృత్తమునకు దక్షిణమున ఐదున్నర హస్తముల దూరమున నున్నది." [XIV, 34]. "పునర్వసులోని నక్షత్రద్వయము అష్టమాంశాంతమున క్రాంతివృత్తమున కిరుపార్శ్వముల (అనగా నుత్తరదక్షిణముల) నొండొంటికి నెనిమిదిహస్తముల దూరములో నున్నవి. పుష్యమి చతుర్థాంశయందు, మూడున్నర హస్తములు ఉత్తరమునకు నున్నది. ఆశ్లేషలో దక్షిణ నక్షత్రము ప్రథమాంశ యం దొకహస్తము దక్షిణమున నున్నది. అటులే మఘలోని ఉత్తర నక్షత్రముకూడ, క్రాంతివృత్తముపైని షష్ఠాంశమున నున్నది. చిత్ర యేడున్నర యంశలలో మూడుహస్తములు దక్షిణమున నున్నది."—ఇందు 360 అంశలు 27 నక్షత్రములకు పంచగా నొక్కొక్క నక్షత్రమునకు 13⅓ అంశలు లభించును. హస్తమనగా నెంతయో స్పష్టముగా నిర్ణయించుటకు వీలులేకున్నది. హస్తమునకు 24 అంగుళము లుండుటచేతను, 32 మినిట్లు వ్యాసరేఖ (Diameter) గల చంద్రమండలము 15 అంగుళములు వ్యాసరేఖ గలదిగా నెంచబడుటచేతను, 1 అంగుళమునకు 2 మినిట్ల 8 సెకండ్లు, అనగా, 1 హస్తమునకు 51 మినిట్లు 12 సెకండ్లు వచ్చుచున్నవి. 60 మినిట్లు అయినచో 1 అంశ (డిగ్రీ) యగును. ఇరువది యెనిమిది నక్షత్ర

రాశులయొక్క యోగతారల స్థానములను, ఇంకను పేరు పెరనక్షత్రములయొక్క స్థానములను సూర్యసిద్ధాంతము సూచించుచున్నది. ఏది యెట్లున్నను, ఆధునిక కాలమున నక్షత్రగోళముల కీయబడిన నామములు ప్రాచీనములు కావనిమాత్రము విశదమగుచునే యున్నది. క్రీ. శ. 1000 వ సంవత్సర ప్రాంతముల క్రాంతివృత్తము రేవతి రాశియందలి ముఖ్యనక్షత్రముతో నారంభించినట్లుల హైందవజ్యోతిష్కు లెంచుచుండిరని నిదర్శనములు గలవు.

వివిధవిత సమయములయందు సూర్యచంద్రు లేనక్షత్రరాశియందుండిరో తెలియజేయు ప్రసంగములు ప్రాచీన గ్రంథములందు లేకపోలేదు. "చంద్రుడు ఫల్గుని యందుండెను." మొదలగు వాక్యములు అట్టి గ్రంథముల యందు తరచుగ నగపడుచునే యున్నవి. కాని "జ్యోతిషవేదాంగము"నకు బూర్వము నక్షత్రమానము నిర్ణయింపబడినట్లు చెప్పుటకు కనబడుటలేదు. ఆగ్రంథము క్రాంతివృత్తము 27 సమభాగములుగా విభజింపబడినట్లును, ధనిష్ఠ నక్షత్రము మకరరాశియందు మొట్టమొదట నున్నట్లును తెలుపుచున్నది. ఈ విషయమై మున్ముందు విపులముగ చర్చింతము. "సూర్యప్రజ్ఞప్తి" యందు క్రాంతివృత్తము 27 21/67(?)భాగములు చేయబడియున్నది. ఇందు నక్షత్రమున కొక్కొక్కటికి అర్థభాగముచొప్పున 6 నక్షత్రములకును, ఒకసంపూర్ణ భాగము చొప్పున 15 టికిని, ఒకటిన్నర భాగము చొప్పున 6 టికిని, మిగిలిన 21/67 భాగము అభిజిత్తునకును చెందుచున్నవి. సూర్యుడు అభిజిత్తునందున్నపుడే మకరసంక్రమణము కలుగుచుండినట్లును కూడ తెలియుచున్నది. మాసములకును, నక్షత్రములకును నొకవిధమగు పరస్పరసంబంధ మేదో యొకకాలమున నుండినట్లును విదితమగుచునే యున్నది.

కాని, నక్షత్రములు క్రాంతివృత్తము యొక్క భాగములు మాత్రమే అయియుండి, ఆకాశమున ప్రత్యక్షముగ నగుపించు జ్యోతిర్గోళముల నురుతించుట కేర్పడిన పేర్లుగా అదిని ఉద్దేశింప బడియుండక పోవచ్చు ననుకొనుటకు వీలు కలదు. ఈవిషయమున విశేషమగ పరిశోధనము జరుగలేదు. కాని మాత్రవాంశము లనేక లట్టి పరిశోధనము వలన మనకు లభింపవచ్చును. గ్రీకు జ్యోతిశ్శాస్త్రమున వాడబడిన రాసుల నామము క్రాంతివృత్తమునందలి ప్రత్యేక నక్షత్రగోళముల కీ బడిన పేరులై యుండెను. కాని యీపేరులు కొల కాల మైనపిదప, గ్రీష్మవిషువత్తు మొదలుకొని క్రాంతివృ త్తమును పండ్రెండు పాళ్లుగా విభజింపగా వచ్చిన భా ములకే వాడబడుచు వచ్చినవి. విషువత్తులయొక్క తిర శ్చిగమనము (Precession of the Equinoxes) వల క్రాంతివృత్తముయొక్క భాగముల పేరులకు, నక్ష రాసుల పేరులకు నుండిన సంబంధము తొలగిపోయిన గ్రీష్మ విషువద్బిందువు మొదలుకొని 30 డిగ్రీలు తూరు నకు మేషమును, అటుపిమ్మట 30 డిగ్రీలు వృషభమును— ఈరీతిగా పండ్రెండు రాసులను 360 డిగ్రీలలో నిమి యున్నవి.

ప్రాచీన గ్రంథములయందలి నక్షత్రనామము కృత్తికతో నారంభించుచున్నవి. ఈనక్షత్రము పే మనము సంకోయ్యలు, లేక పిల్లలకోడి అని పిలుచ (Pleiades) రాశియేయని యెంచినచో, నేటికి సుమా 3,200 సంవత్సరములక్రిందట గ్రీష్మ విషువద్బిందు వీనక త్రమున నుండియుండవచ్చును. నక్షత్రముల నామము జ్యోతిష వేదాంగమున ధనిష్ఠతోను, మహాభారతము శ్రవణముతోను, సూర్యసిద్ధాంతమున అశ్వినితోను, సూర ప్రజ్ఞప్తియందు అభిజిత్తుతోను ఆరంభించు చున్న విషువత్తులయొక్క వక్రగమనమువలన నీనక్షత్రము యొక్క ప్రథమస్థానము కృత్తిక నుండి అశ్వినివర మార్పులబడి వచ్చెనని చూచినచో నదే మన మెంచుదుమ కాని యీ యూహకు చాల ప్రతిబంధకములు కల తిలకు, థీబు మున్నగువారు సూచించి యుండిరి. కృ కతో నారంభించుటకు దైవత పూజానిమిత్తమై కాని, లేక జ్యోతిషఫల నిమిత్తమైనట్టి కాని వేరొ యంతరార్థ ముండెనేమోయని వారు అభిప్రాయపడి రి. పూజానిధులకు కృత్తిక మొదలనియు, కాలమ మునకు ధనిష్ఠ మొదలనియు గర్గుడు శాసించెనని తె

నట. సూర్యచంద్రులును, బృహస్పతియు పుష్యమీ నక్షత్రమునందు కలిసికొనునపుడు కృతయుగము ప్రారంభమగునని తృతీయపర్వము (190-90) నందున్నది. పుష్యమీనక్షత్రము కర్కాటకరాశియం దున్నది. గ్రహములు కర్కాటకరాశియందు కలిసికొన్నపుడు జగములు భగ్నములగునని బెరోసస్ (Broses) అను సనాతన పాశ్చాత్యశాస్త్రజ్ఞుడుకూడ సూచించి యుండెను.

ఈగ్రంథమున గొన్ని సందర్భములలో 28 నక్షత్రములున్నటుల వ్రాయబడినను, సాధారణముగానవి 27అనియే వాడబడియున్నవి. అభిజిన్నక్షత్రము అదృశ్యమైనటుల నొక గాథ కలదు. "రోహిణియొక్క అనుంగు చెల్లెలయిన అభిజిత్తు రోషావేశపూరితయై కానలకేగి నిష్ఠాగరిష్ఠురాలై యున్నది. పతితమయిన యానక్షత్రముయొక్క స్థానమున నింకొకదానిని నిర్మించుటకు నాకు దుస్సాధ్యముగ నున్నది." (iii-230, 2 నా.) ధనిష్ఠతో కాలమానము ప్రారంభింపవలెనని బ్రహ్మదేవుడు శాసించెను. (iii,230-10). కాని "విశ్వామిత్రుడు రోషాతిరేకమున, రెండవలోకమును, శ్రవణతో ప్రారంభించెడి యసంఖ్యాకములను నక్షత్రములను సృజించుట వలన," శ్రవణతో మొదలు పెట్టవలసివచ్చెనని(xi,44-2) చెప్పబడియున్నది. చాంద్రమానము శుక్లపక్షముతో ప్రారంభించుచున్నది. పక్షమునకు 14,15 లేక 16 దినములుకూడ నుండవచ్చును. త్రయోదశినాడు గ్రహణము కలిగినటుల నొకచోట సూచన కలదు. (vi,3-32.) గ్రహములు వరుసగ నీక్రమమున పేర్కొనబడియున్నవి:" (1) శుక్రుడు (2) బృహస్పతి (3) బుధుడు (4) అంగారకుడు (5) శని (6) రాహువు (7) ఇతరగ్రహములు" (ii,11-37) నక్షత్రములు దూరస్థములగుటచే చిన్నవిగా నగపడినను, చాల పెద్దవిగానే యున్నవని తృతీయపర్వమునం (42-24) దున్నది. ఈగ్రంథములలో 'నిల్ల నీవిమయమే కడు నత్యద్భుతమగు జ్యోతిషరహస్యమని పాశ్చాత్యశాస్త్రజ్ఞు లెంచుచున్నారు. సనాతన యవన (గ్రీకు) శూరుడగు హిరాక్లిడీసు క్రీ. పూ. 350 సంవత్సర ప్రాంతములందే 'ధ్రువనక్షత్రము నాకాశమునందు వ్రేలాడెడి గోళమనియు, నందు ప్రతిదానియందును భూమి, వాయువు, ఆకాశము కూడియుండునవనియు', శిష్యులకు బోధించియుండెను.

## రామాయణము

వాల్మీకి మహర్షిప్రోక్తమగు రామాయణము క్రీ. పూ. 8, 4 శతాబ్దములందు రచింపబడి యుండవచ్చును. కాని మనకు నేడు లభించెడి గ్రంథమున నాధునికకాలమున వ్రాయబడి యందు చేర్చబడిన భాగములు కొన్ని లేకపోలేదు. జ్యోతిషసాంప్రదాయములు గల గాథ లనేకము లందు కలవు. రోహిణీచంద్రులకథ తరచుగ నం దగపడుచున్నది. చంద్రునియొక్క స్థానము దెలిపెడి నక్షత్రనామములు పెక్కింటిని పేర్కొనబడియున్నవి. పుష్యమీనక్షత్రము మీనరాశియందున్నదని యొకశ్లోకము (i కాం. 19 శ్లో.) స్ఫురింపజేయుచున్నది. సప్తర్షిమండలమును గూర్చియు, త్రిశంకు స్వర్గమును గూర్చియు ప్రస్తావన లిందు కలవు. అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు అను గ్రహముల పేర్లును కలవు. అగస్త్యుడు శ్రీరామునకు సూర్యప్రశంసనము వర్ణించుటయు, ఆదిత్యహృదయమను మహామంత్రము నుపదేశించుటయు యుద్ధకాండమున నొకయాఖ్యానమున వర్ణింపబడియున్నది. (గోపీనాథరామాయణము 2వ సంపుటమున 781 పుట కూడ చూడుడు.) చంద్రుడు రాహుగ్రస్తుడగునటులకూడ నున్నది కాని కేతుగ్రహ మిందు దుదాహరింపబడిన ట్లగపడదు. వింధ్య, హిమవన్నగములకంటె మేరు పర్వతము న్నతమైనదనియు నందు గలదు.

## విష్ణు పురాణము

ఈ గ్రంథమునం దొక భాగమును సంక్షిప్తముగ నిట్లు వ్రాయుచున్నాము: "సప్తద్వీపములును సప్తసముద్రములచే పరివృతములై యున్నవి. వీనిలో జంబూద్వీపము కేంద్రమున నున్నది. ఈద్వీపము నడుమను స్వర్ణమయమగు మేరుపర్వత మున్నది. ఆమేరు పర్వతము భూమిపై 84,000 యోజనముల యెత్తునకును, భూగర్భములో 16,000 యోజనముల లోతునకును విస్తరించి యున్నది. శృంగమున వ్యాసము (Diameter) 32,000 యోజనములును, భూసమప్రదేశమున 16,000 యోజనములు నుండుటవలన

బర్మా-భారతదేశములలో మాకు చాల ప్రసిద్ధి కలదు

# వెండిసామానులు

# బంగారుసామానులు

## పరిశుద్ధమైనట్టియు అందమైనట్టియు
## ఉపయోగకరమైనట్టియు వస్తువులు

పరిశుద్ధత—కలితీలేని వెండిని అనగా చాదీవెండిని కాసులబంగారమును మాత్రమే యుపయోగించెదము. మేమ తయారుచేసిన ప్రతివస్తువపైనను మా డయమండు ట్రేడుమార్కు తప్పకుండ నుండును.

అందము—మా నమూనాలు అన్నియును క్రొత్తరకములుగాను బహుసొగసుగాను యుండును. ఈకాలమునంద నవనాగరీకులు ఆమోదించబడిన పద్ధతులపైని వెండిసామానులను సాటిలేని నూతనస్వరూపములతో తయారుచేయించుచున్నాము.

ఉపయోగము—కలితీలేని వెండిసామానులను కొనుటవలన ధననష్ట మేమియును కలుగదని వేరుగాచెప్ప నక్క లేదు. "ఏది శ్రేష్ఠమైనదో అదియే యెల్లప్పుడును చౌకయైనది" అను సామెతప్రకారము వస్తువు కొనునప్పుడు అది యెన్నియేండ్లు మన్ను ననువిషయమును బట్టియే ధరను నిర్ణయింపవలసియుండును.

మీరు మీయింట నుంచుకొనుటకును ఒకరి కిచ్చుటకునుగూడ చూచినంతమాత్రమునానే మీ కాశ కలిగింపగ వెండిసామానులు మావద్ద నున్నవి.

అన్నివిధములైన సామానులును మావద్ద సమృద్ధిగా నున్నవి. వానిలో మంచివానిని మీ రెన్నుకొనుటలో మీర కోరినచో నిపుణులగువారు మీకు సలహానిచ్చుటకు సిద్ధముగా నుందురు. బహుమతిచేయుటకు యేరకమ వెండిసామానులు కావలసినను అనుకూలమైనవానిని యెన్నుకొనుటలో మే మన్నిసౌకర్యములను కలు జేసెదము.

మా పద్ధతి—నవరత్నముల వ్యాపారమునందు మే మేపద్ధతి నవలంభించియున్నామో ఆపద్ధతిని వెండి బంగా సామానుల వ్యాపారమునందుగూడ మే మవలంభించియున్నాము. మోసములేకుండను కిమ్మతుచేయ నట్టియు సరుకులను యిచ్చుటయే మాపద్ధతి!

ఎస్టిమేటులు—ఏరకము వస్తువులకైనను మేము నమూనాలును సిద్ధపరిచి కోరినవారి నమూనాలను ఎస్టిమేటులన పంపించెదము.

మీ ఆదరణను కోరుచున్నాము.

# సురాజ్‌మల్ లల్లూభాయ్ అండు కో,

## డయమండు మర్చెంట్సు అండు జ్యూయలర్సు,

## గోల్డు అండు సిల్వరు స్మిత్సు,

135, బిగ్ బజారు, తిరుచనాపల్లి.　　313, ఎస్ప్లనేడు, మదరాసు

దెరో తెలియుటలేదు. విషువత్బిందువు క్రాంతివలయమును చుట్టి వచ్చుటకు 25,696 సంవత్సరములు పట్టును. మన జ్యోతిషగ్రంథము లీకాలమును 24,000 సంవత్సరములుగ నుదాహరింపుచున్నవి. సప్తర్షి మండలము ప్రతి నక్షత్రరాశియందును 600 సంవత్సరములవరకు నుండునని వరాహమిహిరుడు వ్రాసినటుల ఆల్బిరూని చెప్పుచున్నాడు. అటులయినచో 27 నక్షత్రరాశులను చుట్టి వచ్చుటకు 27 × 600=16,200 సంవత్సరములు చాలు. కా ఈసమాధానమువలననయినను ప్రయోజన మగపడుట లేదు. కాని 27ను 900చే గుణింపగా 24,300 వచ్చుచున్నది. పైన వివరింపబడిన పురాణమాత్రముయొక్క నిజమును వర్ధిల్లేదెమో శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేయవలసియున్నది.

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ చందాదారుసంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది.

చందాదారులకు భారతి ౧౦వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మాకార్యాలయమునకును తెలుప గోరెదము. —భారతి

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజుకాగితములపై ఒక వైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండా, తిన్నగా వ్రాసి పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిక్కిలి కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచి పోవునని మనవి.

# క్రాంతిపాత

కొటికెలపూడి యజ్ఞేశగారి నరసింహశర్మ గారు

క్రాంతిపాత (Equinoclial point) పరిడోలనము (Pendulum) గా తిరుగుచున్నదా? లేక పశ్చాద్గతిని బోవుచున్నదా? సదా మారుటకు గారణమేమి? అను సంశయములు విచారణీయములై యున్నవి.

క్రాంతిపాత యనగా విషువత్క్రాంతివృత్తద్వయసంపాతము (Equinoclial point).

ఇందునుగురించి మకరసంక్రాంతి లేదీవియందు నాచే వ్రాయబడిన వ్యాసములో క్రాంతిపాతగతి అవసరమైనందున కొంతవరకు పరిశీలించితిని గాని యది గొప్పయంశమగుటనుబట్టి విద్వాంసులపైని విడిచిపెట్ట వలసివచ్చినది.

ఏల యనగా:— సౌరసిద్ధాంతమున క్రాంతిపాతను గూర్చి.

"శ్లో. త్రింశత్కృత్వో యుగే భానాం
చక్రం ప్రాక్పరిలంబతే,
తద్గుణాద్భూదినైర్భక్తా
ద్ద్యుగణాద్యదవాప్యతే.
తద్దోస్త్రిఘ్నాదశాప్తాంశా
విజ్ఞేయా అయనాభిధాః.

భానాం చక్రం, రాశీనాం వృత్తం, క్రాంతివృత్తం. స్వస్వవిక్షేపమితశలాకాగ్రప్రోత నక్షత్రగర్భై ర్వ్యక్త మిత్యర్థః; యుగే, మహాయుగే, ప్రాక్, పూర్వవిభాగే, త్రింశత్కృత్వః త్రింశత్సంఖ్యాకాకృతి ర్వింశతిః, షట్ఛత మిత్యర్థః; పరిలంబతే, ధ్రువాధారభగోళస్థానా త్తద్ద్వార మవలంబతే, అత్ర పరిలంబత ఇత్యనేన భచక్రపర్యభ్రమణాభావ ఉక్తోఽన్యథా గ్రహభగణప్రపంచేన మధ్యాధికార ఏవ తదుక్తం స్యాత్, తథాచ, తద్ద్వార మవలంబనోత్థా పరావర్త్య యథాస్థితం భవతీత్యాగతం, తత్రాపి స్వస్థానా త్తద్గత పశ్చిమతో వ్యవలంబత ఇతి సూచితం; ఏవం చ భచక్రం పశ్చిమతః ఊర్ధ్వరేఖయా ప్రథమతః కతిచిద్భాగాః శ్చలతి, తతః పరావృత్య యథాస్థితం భవతి తతోఽపి తద్భాగాః క్రమేణ పూర్వత శ్చలతి. తతోఽపి పరావృత్య యథాస్థిత మిత్యత్రో విలక్షణో భగణః, నేవ ప్రాగిత్యుపలక్షణం. పశ్చిమావలంబనా మ త్రిష్టు సంపాదకాలే త దభావాత్. అత్ర త్రింశత్కృత్వ ఇతి పాఠః ప్రామాదికః.

శ్లో. యుగే షట్శతకృత్వో హి
భచక్రం ప్రాగ్విలంబతే.

ఇతి సోమసిద్ధాంతవిరోధాత్. తత్పశ్చాచ్చలితం చక్ర మితి బ్రహ్మసిద్ధాంతోక్తేశ్చ."

ఇటుల చెప్పుటవలన క్రాంతిపాత సృష్ట్యాదిని మేషాదిబిందువులో నుండి సంవత్సరమునకు ఏబదినాల్గు వికలలు గతి గలిగి ప్రాగ్గతితో పదునెనిమిదివందల సంవత్సరములకు సదరు మేషాదిబిందువునకు ఇరువదేడు భాగలదూరమున సంపాతము నొంది, పిమ్మట పశ్చిమగతితో పదునెనిమిదివందల సంవత్సరములకు మేషాదిబిందువును కలిసి, మరి పదునెనిమిదివందల సంవత్సరములకు సదరు బిందువునకు పడమరవైపు ఇరువదేడుభాగల దూరమున సంపాతము నొంది, తిరిగి ప్రాగ్గతితో మేషాదిబిందువుతో సంపాతము నొందును. ఈప్రకారము 3,600 (ముప్పదియారువందల) సంవత్సరములు ప్రాగ్గతితోను, తిరిగి 3600 ల సంవత్సరములు పశ్చాద్గతితోను మహాయుగమునకు (600) ఆరువందల పర్యాయములు చలించుచుండుననియు కనబడుచున్నది.

బ్రహ్మసిద్ధాంతమునందలి—

"శ్లో. ప్రత్యక్చలస్య మేషాదౌ
తులాదౌ ప్రాక్చలో భవేత్,
కర్క్యాదిస్థో మృగాదిస్థ
స్పష్టే రుదగపాఙ్ముఖః,

ప్రత్యబ్దం యాంతి యామ్యోద
గ్గమనే విహితాపి యత్,
తత్పశ్చాత్ స్ఫుటితం వక్రం
ఉపచారో౽య మిత్యపి.

తతః పశ్చాల్లఘుక్రాంతి
ప్రసంగా త్పరివర్తనాత్,
తతో౽వ్యక్తాత్ ప్రత్యబ్దం
కించిత్ కించి ద్వ్రజంత్యపి.
పశ్చిమాంశక్రమప్రాప్తి
ప్రాక్ప్రక్రమం చలితం హి వ,
యావ త్స్వల్పప్రాకృతి నిర్దిష్టే
స్థానం తావ ద్వ్రజంతి తే."

అనువచనములు సౌరసిద్ధాంతమును బలపర్చుచున్నవి.

ఇదిగాక సోమసిద్ధాంతము మొదలగు దైవార్ష సిద్ధాంతములు సౌరమతమును స్థిరపర్చుచున్నటుల గనుపడును.

ఈశ్లోకములనుబట్టి క్రాంతిపాత పరిడోలనముగ జరుగుచున్నటుల వ్యక్తమగుచున్నది. మన పూర్వులలో ముంజాలాదులు క్రాంతిపాత ఇతరగ్రహపాతలవలె వక్రముగనే భగణపూర్తి చేయుచున్న దనిరి.

భాస్కరులవారు—

"శ్లో. అయనచలనం యదుక్తం
ముంజాలాద్యైః స ఏవాయం,
తత్పక్షే తద్భగణాః
కల్పే గోంగర్తురసగోచంద్రాః.

వ్యా. యే, అయనచలనభాగాః ప్రసిద్ధాస్త ఏవ విలోమగస్య క్రాంతిపాతస్య భాగాః, మేషాదేః పృష్ఠతః తావ ద్భాగాంతరే క్రాంతివృత్తే విషువద్వృత్తం లగ్న మిత్యర్థః. తం విలోమగం క్రాంతిపాతం—"

అని సిద్ధాంతశిరోమణియందు వ్రాసినందున, క్రాంతిపాత సదా పశ్చిమగతితో జరుగుచున్నటుల ముంజాలాదులు భగణకథనపూర్వకముగ జెప్పిరి.

ఇంతియుగాక వీరు—

"శ్లో. విషువత్క్రాంతివలయో
స్సంపాతః క్రాంతిపాత స్స్యాత్
తద్భగణాః సౌరోక్తాః
వ్యస్తా అయుతత్రయం కల్పే."

అని చెప్పుటవలన వీరికాలమున సౌరమునందు క్రాంతిపాతకు సదా వక్రగతి కలదనెడు పాఠ మున్నటులును, అందు తద్భగణములు మహాయుగమునకు ముప్పదిగ జెప్పబడియున్నటులును వ్యక్తమగుచున్నది. అందు వక్రభ్రమణ మనునది సరియైనదనియు, ముప్పదిభగణము లనునది సరియైనది కాదనియు వీరి యభిప్రాయమైనటుల వ్యక్తమగుచున్నది.

గూఢార్థప్రకాశికారుల కాలమునకు—

"శ్లో. త్రింశత్కృత్యో యుగే భానాం."

అను పాఠ మున్నటు లగపడుచున్నది గాని వక్రగతిని దెలియజేయు పాఠ మున్నటు లగపడదు.

పాశ్చాత్యజ్యోతిస్సిద్ధాంతులు సంపాతము పైని వ్రాసినరీతిని పెండ్యులమువలె జరుగక సదా ప్రత్యగ్గతితో దీర్ఘవృత్తమునందు 25,800 ల సంవత్సరములకు ఒకమారు భగణపూర్తి చేయుచున్నదని చెప్పెదరు. ఇందునుబట్టి దీనిగతి సంవత్సరమునకు ౫౦ [illegible] వికలలు గలదై యున్నది. దీనిగతి సంవత్సరమునకు 52 వికలలనియు, ప్రకృతము 50 వికలలకు పైబడియున్నదనియు చెప్పెదరు. బ్రహ్మసిద్ధాంతము మొదలగునవి సౌరమతమును బలపర్చుచున్నవి.

భాస్కర, ముంజాలాదులు పాశ్చాత్యమతమునే యవలంబించిరో, పాశ్చాత్య సిద్ధాంతులు ముంజాలాది మతమునే తీసికొనిరో తెలియదు, గాని యీరెండు నొకరీతిమతము రెండవవారి మతమున కుపష్టంబకముగ నున్నది.

సాయనులవారు గవామయనములు మొదలగు సత్రములను చేయుకాలమును నిర్ణయించుచు, వానిలో వచ్చెడి ఏకాష్టదినము విషయమై తాండ్యబ్రాహ్మణములోని (౫—౯) ప్రతి "చైత్రపూర్ణిమాసే దీక్షేరన్. ముఖం వా ఏత త్సంవత్సరస్య య చ్చైత్రపూర్ణిమాసో ముఖ

తో వై నక్షత్ర ముఖత ఏవ తత స్సంవత్సర మారభ్య దీక్షంతే తస్య న నిర్యాంతి." అను శ్రుతికి చైత్రపూర్ణిమ నాటి రాత్రి సంవత్సరారంభ మనగా ఉత్తరాయణ మారంభమైనదని వ్రాసిరి. ఇందునుబట్టి క్రాంతిపాత పునర్వసులో నున్నటుల గాన్పించుచున్నది.

శతపథబ్రాహ్మణములో (౯-౩-౨-౧౮) శ్రుతి: "ఏషా వై సంవత్సరస్య ప్రథమా రాత్రిః. యత్ ఫల్గునీ పౌర్ణమాసీ." తైత్తిరీయ బ్రాహ్మణం. (౧-౧-౨-౮)- "ఏషావై ప్రథమారాత్రిః-సంవత్సరస్యయదుత్తరేఫల్గునీ." సాంఖ్యాయన బ్రాహ్మణం (౪-౪)- "ముఖంవా ఏత త్సంవత్సరస్య యత్ఫల్గునీమాసి" అను శ్రుతికి సాయనుల వారు శ్రు. ఉత్తరయో రాదధీత= ఏషావై ప్రథమా రాత్రిః, సంవత్సరస్య యదుత్తరే ఫల్గునీ- అను ఆధాన బ్రాహ్మణములోని శ్రుతిని వ్రాయుచు ఫాల్గుణపూర్ణిమ నాటి రాత్రి ఉత్తరాయణప్రారంభమని వ్రాసిరి. ఇందునుబట్టి పైరొక్త కాలమునకు క్రాంతిపాత మృగశీర్షానక్షత్రములో నున్నటుల వ్యక్తమగుచున్నది.

గోపథబ్రాహ్మణం (౧-౧౯) శ్రు. "ముఖము త్తరే ఫల్గుణ్యౌ పుచ్ఛం పూర్వే తద్యథా ప్రవృత్తస్యాంతౌ సమేతౌ స్యాతాం. ఏవ మేత త్సంవత్సరస్యాంతౌ సమేతౌ భవతః". ఈశ్రుతుల ప్రకారము ఉత్తర పూర్వఫల్గునీనక్షత్రములు సంవత్సరముయొక్క ఆద్యంతములనియు, ఫాల్గుణపౌర్ణమినాటిరాత్రి ఉత్తరాయణారంభమనియు వ్రాయుచు, గణితరీతిని ఉత్తరాయణప్రవేశము ఉత్తరాభాద్ర ప్రథమచరణాంతం, మేషాయనం ఆర్ద్రాదిపాదారంభమగు మృగశీర్షాంతం, దక్షిణాయనం ఉత్తరఫల్గునీ పదియవభాగము, తులాయనం మూలా ద్వితీయచరణాంతం, అనగా గాన అశ్వినీప్రథమకారంభమునకు ౬.౩(అరువది మూడు) భాగలదూరముగల మృగశీర్షానక్షత్రములో పాత యున్నటుల వ్యక్తపరచిరి. భారతయుద్ధకాలమును విమర్శించునపుడు, ఆ యుద్ధకాలమునకు క్రాంతిపాత కృత్తికాచతుర్థపాదములో నున్నటు లగపడెను. దీనిని బట్టి సౌరాది సిద్ధాంతములయందు చెప్పబడిన ప్రకారము క్రాంతి పరిడోలనగమన మనుటకు అవకాశమియ్యదు.

సౌరాదులందు క్రాంతిపాత సమగతితో పరిడోలనముగా తిరుగుచున్నటుల వ్యక్తమగుచున్నది. సమగతితో పోవునపుడు పరావృత్తి యనుపపన్నము. ప్రతిఘాత ముండునపుడు పరావృత్తియుండును గాని ద్వితీయాది పరివర్తనలయందు సమగతి విరుద్ధము—ప్రతిఘాతము నిర్నిరూప్యము. ఇదిగాక ఇతరగ్రహపాతలకు పశ్చిమగతి చెప్పుచు సంపాతమునకు మాత్రము పరిడోలనము చెప్పుటకు కారణ మగపడదు.

క్రాంతిపాత చక్రముగనే భచక్రభ్రమణము చేయు నెడల కాలక్రమమున మకరసంక్రమణము, పుష్యమాసము సూర్యుడుత్తరమునుండి దక్షిణమునకు మరలునపుడు కావలసివచ్చును. అటులయినచో, "మధుశ్చ మాధవశ్చ వాసంతికావృతూ" ఈ మొదలగు శ్రుతివాక్యములకు విరుద్ధములుగ ఋతువులు మారవలసివచ్చును.

ఈపై నుదాహరించిన యంశములనుబట్టి ద్వివిధగతులలో నేది నిర్ణయించుటకు అవకాశ మియ్యలేదు.

సంపాత గమనమునకు గూఢార్థప్రకాశికయందు ఈశ్వరేచ్ఛయే కారణమని వ్రాసిరి. ఇందువిషయమై యోచించ నవసరము లేదు. ధ్రువకదంబముల పరస్పర మత్స్యాకార భ్రమణమువలన పరిడోలనగతి గలిగినదని కొందరనిరి.

ధ్రువమునకు చలన మెటులసంభవించునో, మత్స్యాకారము పరిడోలన మెట్లగునో యోచింపవలసియున్నది.

భ్రమించుచున్న పృథ్విపై సూర్యాకర్షణ పడుటనుబట్టి యీభూభ్రమణమునకు వంపుగలుగుటవలన సదా పశ్చిమగతి గలిగినదని పాశ్చాత్యజ్యోతిస్సిద్ధాంతజ్ఞులనిరి. భ్రమించుచున్న భూమిపై బడు సూర్యాకర్షణవలన గలుగువంపు క్రాంతికక్ష్యయొక్క వంపు అయియుండినచ్చును గాని సంపాతగమనకారణ మెట్లగునో తెలియదు.

ఈయంశములనుబట్టి సంపాతగమనకారణాదుల యథాస్థితి సంపూర్ణముగ తెలియనందున స్థిరపరచుటకు వీలులేకపోయినది. కాన నిందువిషయమై విద్వాంసులు పరిశీలించి యథార్థమును సయుక్తికప్రమాణముగ తెలియజేయ వేడుచున్నాడను.

# ఆంధ్రాభ్యుదయము



సర్ కె. వి. రెడ్డినాయుడుగారు

దక్షిణాఫ్రికాయందు ఇండియాప్రభుత్వపు ఏజంటుగ నున్న రైటు హానరబులు శ్రీనివాసశాస్త్రి గారు 1929 సంవత్సరము ప్రారంభమున ఉద్యోగము వదలనుద్దేశము తెలిపిరి. ఈ ఉద్యోగమును అవధికారునకే ఇవ్వ వలయునని ఇండియా ప్రభుత్వమువారు తీర్మానించుకొని సర్ కె. వి. రెడ్డినాయుడుగారిని ఇండియా ప్రభుత్వపు ఏజంటుగ ప్రభుత్వమువారు నియమించిరి. ఈసంవత్సరము (1928) ముగియగనే రెడ్డినాయుడు దక్షిణాఫ్రికాకు ప్రయాణమై వెళ్లెదరు.



ఏచూరి నరసింహాము పంతులుగారు

విజయనగర సంస్థానమున పరల దివానుగా నియమితులైరి.

# ఏచూరి నరసింహము పంతులుగారు, య. ఏ.

(విజయనగర సంస్థాన మంత్రిశేఖరులు)

భోగరాజు నారాయణమూర్తి గారు

(పంచరత్నములు)

శ్రీయున్ భూమియు నంక భాగముల భాసిల్లన్ శ్రితశ్రేణికిన్
శ్రేయోదాయకుఁ డై జగత్త్రితయమున్ బ్రోచుచు దైవంబు తా
నాయుర్వృద్ధి యశస్సమృద్ధియును నిత్యంబుం బ్రసాదించుతన్
మా యేచూరి నృసింహ సూరినుత సన్మార్గైక సంచారికిన్.

క్రమ మేపార సమస్తకార్యములు చక్కం గూర్చి పట్టాభిషే
కము గావించితి నీవ రాజునకుఁ బ్రఖ్యాతిన్; మంత్రి వై నీవ; నేల్
సమయంబున గనిపెట్టి యుంటఁ గవితాసామ్రాజ్య పట్టాభిషే
కము నైతిమ్ము స్వయమ్ముగా నృపునకుం గావింపు మంత్రీశ్వరా!

రాజుల్ మంత్రులె పూర్వ మాంధ్రకవితా రాజ్యంబుఁ గాపాడి రా
రోజుల్ నేఁడు కవిత్వతత్త్వకలనా రూఢుల్ నినుం బోలువా
ప్రజామాత్యులు నీగాఁగ వాణిపతితోడం జెప్పఁ జేయించె నీ
రాజామాత్యు లదే సుమీ కవితధారం బింక మంత్రీశ్వరా!

యతులుం బ్రాసలు పోజరుల్ మనవిసేయన్ సర్వశాస్త్రార్థసం
గతులున్ మేల్పరివార మై కొలువ, శృంగారాది నానారస
ప్రతతుల్ కార్యభరంబు దీర్పఁ, గవితారాజ్యంబు పాలించు ధీ
యుతులన్ సత్కవిరాజులన్ మఱవ నీ వోహో, యమాత్యాగ్రణీ!

స్తోత్రపాత్రం బైన కృతిరత్నం గాలేద యశము భాసిలఁ జేసినట్టికలము
ఆంగ్లోపాధ్యాయు లలర వేతనముల నధికంబు గావించినట్టికలము
సర్వకావ్యధురీణు సను మహారాజ సంస్థానకవిఁ జేసినట్టికలము
బహుకుటుంబంబుల కహరహంబును జీవనాధారములఁ గూర్చినట్టికలము
ధరణిఁ గలకాలమును నిల్చు తావకీన-కరము నంగాలుచుండెదుం గాక యనుచు
ప్రజలు వాంఛింత్రు సజ్జనప్రతతివినుత-మహితగుణధుర్య, నరసింహమంత్రివర్య!

---




? ? ? ? ? ? ? ? ? ? ?


బట్టలు,
ఎప్పుడు తెస్తావ్?


బట్టలు
తెస్తావా? లేదా?


హా యయనా!
బట్టలు లేవ్వూ?
తెస్తానెళ్ళ
వేయ్యా


మూడు బట్టలు
కనబడ లేదండి






© తలిసెట్టి రామారావు.

# కీ. శే. లాలా లజపతిరాయి

## బాల్యదశ, విద్యాభ్యాసము

పంజాబు రాష్ట్రమున లూధియానా జిల్లాలోని జగ్రాము అను పట్టణమందు ౧౮౬౫ సం. లాలాజీ జననమందెను. ఈయనది అగర్వాలాజాతి వైశ్యకులము. ఈతని కుటుంబికులు ధనికులు కాకపోయినను చాల గౌరవముగ నుండిరి. లాలాజీ తండ్రియగు లాలా రాధాకృష్ణగారు మొదట ప్రభుత్వ పాఠశాలలో ఉరుదు పండితునుగ నుండిరి. ౧౮౭౭ లో స్వామి దయానంద సరస్వతిపట్ల రాధాకృష్ణగారికి కల్గినికమును భక్తి కుదిరెను. లాలాజీతల్లి గూడ గొప్పశీలవతి. ఆడంబరరాహిత్యము, మితవ్యయము మున్నగునవి ఆమెవలననే లాలాజీ నేర్చుకొనెను. రాధాకృష్ణగారు ఉపాధ్యాయుడగుటచేతను, విద్యాభిమానియగుటచేతను లాలాజీకి ఉత్తమ విద్యను చాల శ్రద్ధతో నేర్పించిరి. లాహోరులోని ప్రభుత్వకళాశాలయందు లాలాజీ రెండేండ్లు విశ్వవిద్యాలయ విద్యార్థిదశనుండి విద్య నభ్యసించెను. ౧౮౮౫ లో న్యాయశాస్త్ర ఉన్నతపరీక్షయందు లాలాజీ కృతార్థుడయి, హిస్సారు అను పురమున న్యాయవాద వృత్తి ప్రారంభించెను.

## ఆంగ్ల వేదకళాశాల

దయానంద ఉద్యమమునుగూర్చి గట్టిపట్టుదలతో పనిచేసిన యువకులు ముగ్గురు: లాలా లజపతిరాయి, పండిత హంసరాజు, పండిత గురుదత్త విద్యార్థిగార్లు.

౧-౬-౧౮౮౬ తేదీని వీరు ముగ్గురును లాహోరు నగరమున దయానంద ఆంగ్ల వేదకళాశాలను స్థాపించిరి. అందిప్పుడు ఎం. ఏ. డిగ్రీవరకును విద్య నేర్పబడుచున్నది. ప్రారంభకాలమున ఆ కళాశాలలో జాతీయ విద్యను నేర్పవలెనని వీరు సంకల్పించిరి. హిందీ, సంస్కృతము, ఆంగ్లము అను నీ మూడు భాషలను, సాంకేతిక విద్యలను నేర్పుటకు అప్పు డాకళాశాల యేర్పరుపబడినది. అప్పటికింకను లాలాజీ హిస్సారులోనే యుండెను. సమర్థుడగుటచే న్యాయవాదిగ అతడు చాలధనము నార్జించుచుండెను. అచట మూడేండ్లు మునిసిపలు సంఘమునకు కార్యదర్శిగ నుండి చాల మేలుచేసెను. ౧౮౯౨లో తన నివాసమును లాహోరునకు మార్చుకొని అచట న్యాయవాదిగ పనిచేయ నారంభించెను.

## మాతృదేశాభిమానము, రాజకీయము

అప్పటినుండి లాలాజీ రాజకీయములందును, సంఘసేవయందును మిక్కిలి పాల్గొన నారంభించెను. సర్ సయ్యద్ అహమ్మదుగారు రాజకీయములందు తిరోగామి దినములలో చూపిన భావపరివర్తనము విమర్శించుచు లాలాజీ పెక్కు బహిరంగ లేఖలను వ్రాసెను. ఆసంవత్సరమునందే అలహాబాదులో జరిగిన కాంగ్రెసు సభకు లాలాజీ వెళ్లెను.

## అనాథ సేవ

౧౮౯౭ లో కఱవు పుట్టినప్పుడు లాలాజీ లాహోరులో అనాథరక్షణోద్యమము ప్రారంభించెను. ౧౮౯౯-౧౯౦౦లో గూడ మరల అట్టి ఉద్యమమునే సాగించెను. మధ్యరాష్ట్రమునను, రాజపుత్రస్థానమునను, [illegible] మునను ౨,౦౦౦ అనాథజనులను ఈతడు పోషింపగలెను. ఫిరోజుపూరులో నొక గొప్ప హిందూ అనాథశరణాలయమును, మీరటులో నొక వైశ్య అనాథ శరణాలయమును స్థాపించి తానే కార్యదర్శిగ నుండి కొనసాగించెను.

## ఆంగ్ల దేశ యాత్ర

౧౯౦౫ సం. అంతమున లాలాజీ ఆరోగ్యము చాల చెడిపోయెను. అప్పుడు ఆంగ్లదేశమున కేగి భారతదేశ స్థితిని తెలుపుటకు లాలాజీయు, గోఖలేగారును ప్రతినిధులుగ నెన్నుకొనబడిరి. అప్పుడే లాలాజీ ఆంగ్లదేశమున కేగెను. అందువలన ఆరోగ్యము కుదిరెను. ఆంగ్లదేశమున పెక్కుతావుల గొప్పగొప్ప సభలయందు లాలాజీ గంభీరోపన్యాసములు గావించెను. పిమ్మట అమెరికా దేశమున కేగి, అచట విద్యాసంస్థలను పరిశీలించెను.



కీ. శే. లాలా లజపతిరాయిగారు

అమెరికా నుండి మరల ఆంగ్ల దేశమునకేగి గోఖలేగారితో కలసి అచటను భారతదేశముగూర్చి చాల ప్రచారము గావించెను. పెక్కుసార్లు విద్యార్థులకు చరిత్రముగూర్చి ఉపన్యాసముల నొసంగెను.

విద్యావిషయమున లాలాజీ చాల సేవచేసెను. దయానందకళాశాలకు ఉపాధ్యాయుడుగ నుండుటయే కాక వకేంద్రపాటు గౌరవ కార్యదర్శిగకూడ నుండెను. ఆకళాశాలకు చాల ధనముగూడ నొసంగెను. జలంధరు ఆంగ్ల సంస్కృత కళాశాలకుగూడ లాలాజీ కార్యదర్శిగ నుండెను.

## ప్రవాసము

లాలాజీకి స్వదేశోద్యమమునందు అత్యధికమగు అభిమానము. ఈయుద్యమమునం దభిమానము గలిగియుండుటయే దేశభక్తికి ముఖ్యచిహ్నమని లాలాజీ మతము చుండెను. ౧౯౦౫ సం: కాశీలో కాంగ్రెసు జరిగినప్పుడు వంగరాష్ట్రమునందలి కఠినశాసనముల గూర్చి లాలాజీ తీవ్రముగ ఉపన్యాస మొసంగెను అప్పు డతడు ప్రభుత్వమును ఎట్టిభయము లేక విమర్శించెను కాని అతడెన్నడును చట్టమునకు విరుద్ధముగ నేపనిని చేసియుండ లేదు. ఆంగ్లోఇండియను పత్రికలు నిరంతరము దొరతనమును ప్రోత్సాహపరచుచుండుటచే ౧౯౦౭ లో సర్ డి. ఇబ్బట్సనుగారి అధికారముక్రింద పంజాబుదొరతనమువారు లాలాజీని అతిరహస్యముగను, అత్యాకస్మికముగను విదేశములకు గొంపోయిరి.

## రాజనీతిజ్ఞత

రాజకీయములందు లాలాజీకి అసూయకింక దెన్నడును లేదు, అతడు కార్యశూరుడుగాని వాక్శూరుడు గాడు, అతని రాజకీయములు విరామికముల గాని నిరర్థకములు గావు. కార్యదీక్షలేని వాచాలత నతడు నిరసించును. ౧౯౦౬ సం. కలకత్తాలో కాంగ్రెసు జరిగినప్పుడు పరమపూజ్యుడగు దాదాభాయి నిరూపించిన స్వరాజ్యాదర్శమే అతని లక్ష్యము.

## సంఘసంస్కరణము

రాజకీయములందు మాత్రమే కాక సాంఘిక లందుగూడ లాలాజీ అధికముగ పనిచేసెను. సంస్కర మును ప్రోత్సాహపరచునట్లుపన్యసించు సమయము నిరసింపదగిన కపటవర్తనములను లాలాజీ తీవ్రముగ వి ర్శించుచుండెను.

## వాగ్ధాటి-గ్రంథరచన

నిండు సభలలో నుపన్యసించుటయందు సమ లగువారిలో నొకడుగ లాలాజీ భావింపబడు చుండెను. పాంచాలమున ఉర్దూభాషలో నుపన్యసింపగలవారిలో లాలాజీ ఒకడు. గ్రంథములలో వీరిశైలి కడుసులభ గను, పటిష్ఠముగ నుండును. వాదములందు ప్రతిపక్ష లోపములను గుర్తించి ఖండించుటలో వీరు కడు ని ణులు. లాలాజీ ఉర్దూభాషలో చాలమంది జీవిత త్రలను వ్రాసెను. ఇటలీ భారతదేశములందలి దేశ మానుల చరిత్రలను దేశభాషలలో వ్రాసెను. తిరుద మాసపత్రికలలో ఆంగ్లభాషయందు వ్యాసములు వ్రా చుండెను. బ్రిటిషు, అమెరికా దేశములపత్రికలకుగూ తరుచు వ్రాయుచుండెను. ఆర్యసమాజమునుగూ గొప్పగ్రంథమును వ్రాసెను. చిరకాలమునుండి ఆర్య మాజమున కతడు చాల సేవచేయుచుండెను. అమెరి దేశపు అనుభవములనుగూర్చి "అమెరికా" యను గ్రంథ నతడు వ్రాసెను. యుద్ధమునకు పూర్వము రెండవ అమెరికాకు పోయినపుడు అచట విపులముగ స ప్రచారము చేసెను. 'మిస్ మేయో'కు జబాబుగ న వ్రాసిన "అన్ హాపీ ఇండియా" అను గ్రంథ మాతని ర్యన సమర్థతను వెల్లడిచేయుచున్నది.

## అమెరికాయందు

యుద్ధసమయమున లాలాజీ భారతదేశమున కాని భారతసేవను రంగమునకు బంపుటకు ప్రభుత్వ నిశ్చయించెనని వినుటవలన అధికోత్సా కలిగి, జైసురాయి దర్యను ప్రశంసించుచు పెస్టుమిని గ జేటుకు వ్రాసెను, లాలాజీరాజభక్తి యిట్టిది

డింపబడినను, యుద్ధము ముగియువరకు అతడు భారత దేశమునకు వచ్చుటకు దొరతనమువా రంగీకరింపలేదు. కావున అచ్చట పెక్కుసంవత్సరము లుండవలసివచ్చెను. అచ్చట నున్నపుడు భారతదేశముగూర్చి పదిలక్షల లేఖ లను లాలాజీ ప్రకటించెనని తెలియుచున్నది. 'అచ్చట ఇండియను లీగు' యను సంఘము చేర్పరచి, 'యంగ ఇండియా' అను పత్రికను ప్రకటించుచుండెను. దాని నమెరికావారు శ్రద్ధగ చదువుచుండిరి.

## ఇండియాకు వచ్చుట-కాంగ్రెసు అధ్యక్షత

౧౯౧౯-౧౧-౧౯ లో న్యూయార్కునందు లాలాజీ వీడ్కోలు సందర్భమున గొప్పసభ జరిగెను. అమెరికా వారు పలువురు ప్రశంసించుచు నుపన్యసించిరి. సార్వస్తా ముని ప్రకటనవలన లాలాజీ తిరిగివచ్చుట కభ్యంతరము తొలగిపోయెను. ౨౦-౨-౧౯౨౦ న, లాలాజీ అమెరికా నుండి బొంబాయి వచ్చినపుడు ఆ దేశప్రజలు లాలాజీకి నిరుపమానమగు స్వాగతమును చెప్పిరి. ౧౯౨౦ సం. కల కత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసుసభకు లాలాజీ అధ్యక్షత వహించెను. ఆసభలోనే గాంధిమహాత్ముని అస హాయోద్యమ తీర్మానము ఆమోదింపబడెను. అటు పిమ్మట పాంచాల సింహముయొక్క గంభీరగర్జనలు, వ్రాతలు, భారతదేశ సంచారములు, హిందూసభాసం స్థాపనలు మున్నగు కార్యములు సువిదితములు. మొన మొన్న లాహోరులో సైమనుసంఘ బహిష్కారము నుద్దేశించి లాలాజీ మున్నగు ప్రముఖుల నాయకత్వమున జరిగిన మహోత్సవమున పోలీసుల లాఠీదెబ్బలు తినిన నాడు మొదలుకొని క్రమముగ ఆరోగ్యము క్షీణించి, చివ కు ౧౭-౧౧-౧౯౨౮ నాడు లాలాజీ పరమపదించెను. ఈదేశ సేవాధురంధరుని మహానిర్యాణము భారతదేశ మును దుఃఖసముద్రమున ముంచివైచినది.

యస్. శ్రీనివాస అయ్యంగారు, సర్. సి. పి. రామస్వామి అయ్యరు, డాక్టరు పట్టాభిసీతారామయ్య, సామి వేంకటాచలచెట్టి, అబ్దుల్ హమీద్ ఖాన్, జోషయా సి. వెడ్జివుడ్, జమల్ మహమద్ సాహిబు, దివాన్ బహదూర్ టి. రంగాచారియార్, డాక్టరు వరదరాజులు, ఏ. రామస్వామిమొదలియారు, మహాత్మాగాంధి, పండిత మోతీలాల్ నెహ్రూ, డా. బిసెంటు, పండిత మదనమో హనమాళవీయ, యస్. ఏ. జిన్నా, జే. యస్. బసు, మౌలానా షౌకత్ ఆలీ, మహమ్మద్ యాకూబ్, దివాన్ చమన్‌లాల్, మిసెస్ సి. ఆర్. దాస్, డా. మహమ్మద్ ఇక్బాల్, సర్ పి. ఠాకూర్ దాస్, సర్ పి. సెథ్నా, మౌలానా హసరత్ మోహానీ, సర్ యస్. షఫీ, కే. సంతానం, సర్. ఏ. కాదర్, కలనల్ క్రాఫర్డు, సర్ ఏ. రహీమ్, ఏ. ఆర్. అయ్యంగారు, సత్యమూర్తి, వి. వి. జోగయ్య, సర్ టి. బి. సప్రూ, సి. వై. చింతామణి, రామేశ్వరీనెహ్రూ, సేన్‌గుప్త, సుభాష్‌చంద్రబోస్, ఆనరబిల్ వి. రామ దాసు, ఏ రంగనాథమొదలియారు, జమ్నా దాస్ మెహతా, జయకర్, జి. డి. బిర్లా, డి. పి. ఖైతాన్, ఆర్. ఛటర్జీ, గిరిధరిలాల్, డా. జి. వరంగ్, డా. యస్. ఆలమ్, ఏ. హెచ్. ఘుజ్నవీ, కే. యస్. రామ్, బి. యల్. రల్లియరామ్, యస్. సిన్హా, మనోహరలాల్, ఎమ్. కే. ఆచార్య, బి. ఏ. సయ్యద్, బి. శివరావు, మౌలానా అబుల్ కలామ్ ఆజాద్, బిపిన్‌బాబు, పోలక్, పెథిక్ లారెన్సు, ఫెన్నర్ బ్రాక్‌వే, భార్గవ్ — ఈ మొదలైన వారు శ్రీ లాలా లజపతిరాయిగారి నిర్యాణమునకు సంతాపము తెలిపిరి.

## లజపతిస్మృతి

చల్లా పిచ్చయ్యశాస్త్రి గారు

భరతమాతృకమెడం బరఁగు నాయకరత్నలలితహారములోని కొలికిపూస
దేశసౌభాగ్యోద్యాన ధీపుష్పవికసన మహితకళాచన్ద్రమండలంబు
శమనవ్రజకవచంబు నవదరించి సతంబు సకలదిశల్ కొన్న శౌర్యశాలి
బాల్య మాదిగ నేఁటివఱకును హైందవ ప్రథితిలోఁ జనిన పురాణమూర్తి
ప్రణుతిపుష్పంబులను దన పైనఁ జల్లు-భారతీయుల హృదయప్రపంచమందు
నదిగో! పాంచాలలోక పంచాననంబు-తాను పోలేదు "లజపతి" ధరణి నిండె.

# భారతీయ మహిళామండలి



### శ్రీమతి చెరియన్ జాకోబ్ సతి

కోయంబత్తూరు మునిసిపాలిటీ క్రొత్త సభ్యురాలు.

### శ్రీమతి డి. శ్రీవాస్తవసతి గారు

జబ్బల్పూరు మునిసిపాలిటీ క్రొత్తసభ్యురాలు.

### శ్రీమతి మాయాదేవి గారు

కలకత్తా వాస్తవ్యురాలు. భారతీయస్త్రీలపక్షము న సైమనుసంఘమునకు నివేదిక పంపినది.

### శ్రీమతి జార్జి డి' సిల్వాసతి గారు

సింహళమున స్త్రీలకు గూడ వోటింగు అధికారము కావలెనని పాటుపడుచున్నది.



### శ్రీమతి శారదా గౌరీమేహతా గారు

బరోడా సంస్థాన ప్రాచ్యమహాసభ స్వాగతకారిణీసమితి కధ్యక్షురాలు.

### శ్రీమతి నయనాదేవి గారు

బీహారీస్త్రీ. సంస్థానవేతనము పొందినది: జినీవాయందు జరుగు అంతర్జాతీయ మహిళామహాసభకు హాజరు కానున్నది.

### శ్రీమతి గంగాబాయి పట్వర్ధన్ను గారు

పూనా వాస్తవ్య. ఇంగ్లండునందు 'కిండరుగార్టను' విషయమున ప్రత్యేకాధ్యయనము కావించి ఈనడుమనే తిరిగి వచ్చినది.

### శ్రీమతి ఎస్. కేట్కారుకన్య

పూనా వాస్తవ్య. ఉత్తమవిద్యాభ్యసనమున కై ఐరోపా వెళ్లినది.



ఆంధ్రవిశ్వకళాపరిషత్తు (ద్వితీయ స్నాతకసభ యందు) బి.ఎ. పట్టముల బడసిన ప్రథమ స్త్రీలు:
శ్రీమతులు కాకర్ల రుక్మిణమ్మగారు; దేవర పార్వతీబాయిగారు; నాస్సి శిఖామణిగారు; జి. దేవానందంగారు; దా. వెం. సుబ్బమ్మగారు.



శ్రీమతి రావ్రాలి వెంకటసుబ్బమ్మగారు

ఈసంవత్సరము జరిగిన ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ యందు ఈమె 'ఉభయభాషాప్రవీణ' యను పట్టమును బొందెను. ఈ పరిషత్తునందు ప్రాచ్యపట్టభద్రవిరుదము ప్రథమమున బొందిన ఆంధ్రవనిత యీమెయే. ఈమె యిపుడు విశాఖపట్నము మేరీ హైస్కూలునందు ప్రధానాంధ్రోపాధ్యాయినిగ నున్నది. ఈమె సుప్రసిద్ధ వాఙ్మయనిష్ణాతులగు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి కోడలు. ఈమె భర్తగారు రాజవాడలో డాక్టరుగ నుండెడివారు; కీర్తిశేషులైరి.



శ్రీమతి రాముని గారు

బళ్ళారి పురపాలక సంఘసభ్యురాలుగ నియమింపబడిన ప్రథమ స్త్రీ.



శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మగారు

విశాఖపట్నము జిల్లా విద్యాసంఘసభ్యురాలు. విశాఖపట్నము విచ్చిలిఆసుపత్రి, ఘోషాఆసుపత్రుల పరిశీలనసంఘమున సభ్యురాలు. ఆ జిల్లాయందు సంఘసంస్కారమున పాల్గొనుచున్న విదుషీమణి.

# కలువకన్నె

పువ్వాడ శేషగిరిరావుగారు, చోడవరపు జానకిరామయ్య గారు

నీకన్నుంగవసొంపు నీలములు కానీ; పేర్మి జేకత్తి నీ
జేకుల్ తీయని తేనియల్ కురియనీ; బృందావనమ్మంతయున్
వాకల్ కట్టి భవత్కృపారసము పైపైఁ బొఱలనీ; యెన్నఁడో
నీకై చేసిన నాతపమ్ము ఫలియించెన్ నేఁడు నీలాలకా.

నెలబాలుండు భవన్మతంబు మఱలించెన్ గాక ము న్నెన్నఁడేన్
గలదే యిట్టి తెలంగుకీ-మోము ముడువంగా నేల?-నీకోసమై
తొలికార్లై సొబగీను జవ్వనముకై తోతెంచితిన్ నీప్రభా
మలవీచీ నికురుంబమందు వెలయింపన్ నీకళానందముల్.

నీకై దివ్యపథానురక్తి వరియించెన్ నన్ను-నీకోసమై
నా కీసన్న్యసన ప్రసక్తియును- ఉన్మాదంబు నీకోసమే;
నా కీజన్మయు వట్టి యుంటుటయు చానా, నీకుఁగా వచ్చె-నీ
కై కౌతూహలవృత్తి యేటి కుదయంబయ్యెన్ నరఃకన్యకా!

సారెకుసారెకున్ బరవసమ్మున నీతొలిజవ్వనంబుకై
కోరి భవన్మనోజ్ఞరుచి కోరకమైన దినమ్ము లాదిగా
నారసి యేఁగుచుంటి వగపై పగలంతయు పోవుచున్నఁ గా
సారము నీమొగమ్ము చిఱు సౌరులు చిమ్మ దదేమి చిత్రమో!

(?) ఆనీలంపున్ దెలిమబ్బువెన్క నగమై యుందంచు తారాడువాఁ
డా నీమోహపువన్నెకాఁడు?- గురుభార్యాసంగ మాఁపేఁడు చే
మేనన్ వస్త్రములేక యింటఁబడి 'పేర్మిన్ నూలుపోఁ గిచ్చువాఁ
డైనన్ గానఁ బడం' డటన్న వగ నింతైనాఁడుసూ! కోమలీ!

అది యుదయావసాన సమయమ్మున వాయువు తెచ్చి యిడ్డసూ
డిద, కొన తేల సాఁగిన యిళింద కుమారిక సన్నగొంతుతో
పదనయి కమ్మనై చెవికి పండువు చేసెడి గాలిపాటలో
వదనములాని చొక్కి రసవంతముగా సుఖియింతు మో సఖీ!

---

# ఆంధ్రసభలు-నంద్యాల-౧౯౫౨ : తీర్మానములు

## ఆంధ్రమహాసభ

### ౧

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి అకాలమరణమునకు ఈ సభవారు చింతించుచు వారి యాత్మకు శాంతికోసంగ ఈశ్వరుని ప్రార్థించుచు, వారా రంభించిన రామదండు ఉద్యమమును మేలుకొల్ప వలె ననియు వారు దలపెట్టియుండిన, రామాలయ నిర్మాణ మును నెరవేర్పవలెననియు నీసభవా రాంధ్రదేశపౌరు లను హెచ్చరించుచున్నారు.

### ౨

దత్తమండల వాస్తవ్యులై యుండి యటు పిమ్మట కృష్ణామండల మందలి తునికేగి యసహాయోద్యమమున కృషిచేసి కారాగార ప్రాప్తినంది పలు ఇడుమలబడి యిటీవల నసువులగోల్పోయిన రాళ్లపల్లి కాశన్నగారి మరణమునకై చింతించుచు, వారి యాత్మకు శాంతి కోసంగ ఈశ్వరుని ప్రార్థించుచు దమ యనుతాపము నీసభవారు కీర్తిశేషుల కుటుంబమునకు తెలుపుచున్నారు.

### ౩

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగురించి మద్రాసు శాసన సభవారు తీర్మానముచేసియు కూడ నది ఫలోన్ముఖము కాలేదు. కనుక ఇండియా శాసనసభలోని ప్రతినిధులు వెంటనే చర్య పుచ్చుకొనవలెనని ఈసభవారు కోరు చున్నారు.

### ౪

బొంబాయి తదితరములైన రాష్ట్రములలో నాం ధ్రులసంఖ్య హెచ్చుగనుండియు వారికి పాఠశాలలలోను, కళాశాలలలోను వారి మాతృభాషను నేర్పుటకు తగిన యవకాశములు నింకను గల్పింపనందుకు చింతించుచు, అట్టి ప్రయత్నము లికనైన సత్వరముగ గావింపబడునని యీ సభవారు విశ్వసించుచున్నారు.

### ౫

ఆంధ్ర సెనేటువారును, శాసనసభ సెలెక్టుకమిటీ వారును తీర్మానించిన ప్రకారము ఆంధ్ర విశ్వవిద్యా లయ కేంద్రస్థానము అనంతపురముగా నంగీకృతము కావ లయునని నిర్ణయించుచు నీ సభవా రీవిషయమును శాసనసభా సభ్యులకు నిర్వర్తనీయముగ నిరూపించు చున్నారు.

### ౬

సింగపూర్ మున్నగు ప్రాంతములలోని యాంధ్ర కార్మికు లనుభవించుచుండు కష్టములకు నీ సభవారు వ్యాకులత పరితాపము గనుపఱచుచు, వారి స్వాతంత్ర్య సంరక్షణకుగా సర్వవిధముల నాంధ్రులెల్లరు తోడ్పడవలె నని కోరుచున్నారు. నాయకత్వము వహించి వారిపర ముగా పాటుబడుచుండు శ్రీయుతులు వి. వి. గిరిగా రిని, ప్రస్నాద రామలింగం గారిని ఈ సభవా రభినందించు చున్నారు.

### ౭

ఆంధ్రుల చరిత్రను ఉపక్రమించి వ్రాసి కీర్తి గ డించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారికి 'ఆంధ్రచరిత్ర చతురానన' బిరుదమును; ప్రపంచములోని నాటకరంగ ములందంతట నవలీలగ పేరుపొందిన తాడిపత్రి రాఘవా చార్యులవారికి 'నాట్యకళాప్రపూర్ణ' బిరుదమును; బౌద్ధ చరిత్ర విజ్ఞాన విఖ్యాతి వహించిన దుగ్గిరాల బలరామ కృష్ణయ్య చౌదరిగారికి 'ఆంధ్రబౌద్ధవాఙ్మయ బ్రహ్మ' బిరుదము నొసంగి వారి నీసభవారు సన్మానించు చున్నారు.

## ౮

గతసంవత్సర మాంధ్ర స్థాయి సంఘమువారు ధన లోపముచే తాము నిర్ణయించుకొనియుండిన ప్రణాళిక యందలి యంశములలో నొక్కదానినైన నెరవేర్పలేక పోయిరి. ఈ సంవత్సరమునైనను నాంధ్రమహాజనులు తగు రీతిని ద్రవ్యసహాయముచేసి స్థాయిసంఘముచే సేవ సేయించుకొనగలరని యీ సంఘమువారు విశ్వసించు చున్నారు.

## ౯

రాజకీయేతర సభలకు, హైకోర్టువారి తీర్పును పాటింపక, నైజాం ప్రభుత్వమువారు ఏటేట లేఖకీ హుకుమత్తు కావలెననుట, హుకుమత్ కోరబడినప్పుడు సరియైన సమయమునకు దాని నందజేయక పోవుట, నైజాంరాష్ట్రమందలి యాంధ్రోద్యమవ్యాప్తి నరికట్టు చున్నవని యీ సభవారు అభిప్రాయపడుచు, నిక నైన అట్టి సభలను గావించుటకు లేఖకీ హుకుమత్తును పొందవలసిన యవసరము లేనట్లు ఉత్తరువు చేయవలయునని యీ సభవారు ఘనతవహించిన నైజాం ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

## ౧౦

తమలో పరస్పరసౌహార్దము నెలకొల్పుటకును, లోక కళ్యాణమునకు సహాయపడుటకును, పరస్పర సమావేశ సంభాషణము లవసరములగుటచే రాష్ట్రేతరాంధ్రులెల్లరు నేచోటనో కచో రాష్ట్రేతరాంధ్ర మహాసభ యను పేర నొక్క సభను సమావేశ పరచుచు, నైక కర్తవ్యములను తీర్మానముల మూలమున జనసామాన్యమున కాంధ్రలోకవ్యాప్తిగ నొనరింపవలయునని యీ మహాసభవారు రాష్ట్రేతరాంధ్రులను హెచ్చరించుచున్నారు.

## ౧౧

ఈ క్రింద పేర్కొనబడిన వారీ మహాసభచే నాంధ్ర స్థాయిసంఘ సభ్యులుగ నెన్నుకొనబడిరి.

1 ఓ. లక్ష్మణస్వామిరావుగారు
2 కే. నాగేశ్వరరావుగారు
3 మద్దూరి అన్నపూర్ణయ్యగారు
4 గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
5 వి. యల్. శాస్త్రిగారు
6 కలసపాడు వెంకటరమణాచార్యులుగారు
7 కె. కోటిరెడ్డిగారు
8 బులుసు సాంబమూర్తిగారు
9 ఎరి లక్కరాజు నాయుడుగారు, ఖర్గపురం
10 కొండా వెంకటప్పయ్య పంతులుగారు

## ఆంధ్ర రాష్ట్రీయమహాసభ

## ౧

కీర్తిశేషులగు మగన్‌లాలు గాంధి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, హకీం అజమలుఖాన్, గోపబంధు దాసుగార్లు పరమపదప్రాప్తి నందుటచే దేశమునకు గలిగిన లోటునకీసభవా రెంతయు విచారమును దెలుపు చున్నారు.

## ౨

స్వరాజ్యకమిటీ నివేదికపై ఢిల్లీయందు సమావేశమైన అఖిలభారత జాతీయోప సంఘమువారు కావించిన తీర్మానము నీ సభవా రామోదించుచున్నారు.

## ౩

లోగడ బెజవాడలో ఏర్పడిన సైమన్‌కమిషన్ బహిష్కార ఉపసంఘమువారు వెంటనే సమావేశమై కార్యక్రమమును నిర్ధారణచేసి తీవ్రమైన బహిష్కార ప్రచారమును జరుపవలెనని కోరనైనది.

## ౪

తూర్పు గోదావరి, విశాఖపట్టణం జిల్లాలలో గొప్పవర్షములవలనను, గొప్పవరదలవలనను కలిగిన తీరని

నష్టములకు ఈ మహాసభవారు ఆప్రజలయందలి సంపూర్ణసానుభూతిని దెలియబరుచు చున్నారు. ఇండ్లు వాకిళ్లు పోయినబీదలకు తగుసహాయము వెంటనే చేయవలసియున్నందునను, పంటలు నష్టమైపోయినందున విత్తనములవగైరా రైతులకు సర్ఫరా చేయవలసియున్నందునను, ఇంకను యితరవిధములను తోడ్పడవలసియున్నందునను యీకార్యసాఫల్యమునకై ఆంధ్రమహాజను లెల్లరును, ఆంధ్రసంస్థలన్నియును ధనసహాయము విరివిగా చేయవలెనని, వరదలవల్ల నష్టపడినవారికి పన్నులను మినహాయింపుచేయవలయునని ప్రభుత్వమువారిని, జమీందారులను ఈ సభవారు కోరుచున్నారు.

౫

ఇదివరకే ఎక్కువ పన్నులభారము చేతను, ఋణబాధలచేతను క్రుంగుచున్న కృష్ణా, గోదావరిజిల్లాల రయితులమీద రీసెటిల్‌మెంటు అను పేర ఎక్కువపన్నులు వేయుటకు గవర్నమెంటువారు ప్రయత్నించుట అక్రమమనియు, అన్యాయమనియు ఈసభవారు ఖండించుచున్నారు.

౬

నాభా మహారాజైన శ్రీ రిపుదమన సింగుగారిని ప్రభుత్వమువారు నిష్కారణముగా రాజ్యభ్రష్టుని జేసియు నింకను తనివితీరక కొడైకెనాలునందు ప్రవాసితునిగా నొనర్చి రాజ్యము తీసికొని తనభార్యపిల్లలనైన తనతోనుంచుకొనుటకు అనుజ్ఞ నివ్వనని కోరిన కోరికను గవర్నమెంటువారు నిరాకరించుటను ఈమహాసభవారు తీవ్రముగా గర్హించుచున్నారు.

౭

హిందూస్థానీ సేవాదళమున సభ్యులుగా జేరియు అట్లు చేయుటకు అవకాశములేనివారు విరివిగా విరాళముల నొసగియు ప్రోత్సాహ మొసగవలయునని ఆంధ్రదేశీయు లందరిని ఈసభవారు కోరుచున్నారు.

౮

రాబోవు సమావేశములు బెజవాడయందు జరుగు నట్లు ఈసభవారు తీర్మానించుచున్నారు.

నంద్యాలాంధ్రసభ జరుగుటకు ముందుగా లజపతిరాయిగారి మరణవార్త తెలిసినతోడనే ఆవసరసభ యొకటి జరుపబడి యీక్రింది తీర్మానము కావింపబడెను:

ఆజన్మాంతము మాతృదేశ స్వాతంత్ర్యమునకై తన సర్వస్వము నర్పించి సేవయొనర్చిన త్యాగమూర్తియగు లాలాలజపతిరాయిగారు హృద్రోగముచే నాకస్మికమరణముపాలగుటయు, సైమనుకమిషనుబహిష్కారార్థమై జరిగిన యూరేగింపును నడిపించుచుండగా పోలీసు అధికారి క్రూరుడై అమానుషమగు పశుత్వబుద్ధితో ఆయన వక్షోభాగమున కర్రతో మోదియుండిన యనతికాలములోనే యీమరణము సంభవించుటయును ఈ ఆంధ్రసభవారికి సంతాపమును గలుగజేయుచున్నదనియు, లాలాజీగారి కుటుంబమునకు సభవారు తమ సానుభూతిని తెలియజేయుచు వారి మరణమువలన కలిగిన తీరని కొరంత వారి కుటుంబమునకేకాక దేశమంతకును కలిగినదనియు, నిట్టి మహనీయుల ఆత్మత్యాగమువల్లనే ఆయాదేశ స్వరాజ్యసౌధము నిర్మాణము చేయబడుననియు తెలియజేయుచున్నారు.

# ఆంధ్ర మహాసభలు



సి. దొరస్వామి అయ్యంగారు
ఆంధ్రరాష్ట్రీయమహాసభాధ్యక్షులు - నంద్యాల



కె. కోటిరెడ్డిగారు
దత్తమండలముల మహాసభ కధ్యక్షులు - నంద్యాల



ప్రొఫెసరు సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు
ఆంధ్రమహాసభాధ్యక్షులు - నంద్యాల
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ద్వితీయస్నాతకసభయందు
వీరు 'డాక్టరు ఆఫ్ లెటర్సు' గౌరవబిరుదము నొందిరి.



డాక్టరు అనీ బీసెంటుగారు
ఆంధ్రరాష్ట్ర సర్వసత్కమహాసభాధ్యక్షురాలు-నంద్యాల.



గా॥ వేమవరపు రామదాసుపంతులుగారు
బొంబాయిరాష్ట్ర
ప్రథమాంధ్ర సాంఘికమహాసభాధ్యక్షులు



## ఎల్లరికంటె బలసినస్త్రీ—పొట్టిమనుష్యుడు

కడచిన సెప్టెంబరు మాసమున ఇంగ్లండునందు జరిగిన 'బార్నెట్' తీర్థమున నిరువురు వింతమనుష్యులుండిరి.



ప్రపంచమున నెల్ల మిక్కిలి బలసిన 'టిటానియా' యనునామె ౧౭ వత్సరముల ప్రాయముగలిగి ౫౭ స్టోనులు (౩౯౭ పౌనులు) తూగినది.

'కేరో' అను ఒక 'ఎస్కిమో' పురుషుడు ... వత్సరముల ప్రాయముగలిగి ౭౯ అంగుళముల ... మాత్రమే యుండెను.

---

### పోషకుడు

'నాష్స్ మేగజిను' అక్టోబరు (౧౯౨... సంచికయందు 'బారీ పెయిన్' గారు వ్రా... "ది పాట్రనైజర్" అనువ్యాసమునుండి-

పాఠశాలలు, గ్రంథమాలలు, ప్రదర్శనములు ఎ... ప్పుడు తమపోషకుల జాబితాలు అచ్చువేయ నుత్సా... పడుచుండును. చక్కగ నడచుచున్న యొకసం... పోషకు డైనవాడు తనప్రఖ్యాతికి మురియుచుండు... కాని, పోషకుడు నిజముగ పోషణ గావించువాడు క... న్నాడు.

నిజముగ నొకదాని పోషణగావించు పోషకు... భూమిపయినెల్ల మిక్కిలి గర్వితుడు. అతడు బ్రతికినం... తలు పీడకును, తిరస్కృతికిని గురియగుచుండును. ... అత డాసంగతి యెన్నడు నెరుగకుండనే మరణించ... వాడుక. ఎల్లప్పుడు నాతడు తనకు లేని గరిష్ఠత నా... దించుకొన గోరుచుండుటయే కాక,వాస్తవముగ తనకు ... పెద్దతికమును పదేపదే బిగ్గరగ ప్రదర్శించుకొను ... డును. అంగ్లైన యాలోచనకును, వినయముగల ... జులకును ఇది చీదర పుట్టించును.

ఆ పోషకు డెన్నడు నుదారుడు కాడు. ... నెత్తిపై దేవత కాజూచువాని కౌదార్య మెట్లు వచ్చు... బాగుగ నుల్లుండి—సాధారణముగా నతడు నడమం...

పొందుట, సామంతదేశముల విద్యార్థులకై యేర్పాటు చేయబడిన విద్యార్థివేతనములను సంపాదించుట మున్నగు సందర్భములలో దగు ప్రవేశము దొరకక భారతీయ విద్యార్థు లనుభవింపవలసిన కష్టము లెన్నియో యున్నవి. ఈకష్టము లూహా ప్రపంచములోనివి కావు. కొంతవరకు వాస్తవమైనవే. అవమానకరమగు నీ దుస్థితినుండి బయ డవలయునన్న, మనవిద్యకై, మన పరిశ్రమలకై పర ములసాయముపై మన మాధారపడకుండ స్వతంత్రు యుండుటకు దగు సాధనముల నారయుట యొక్కటి మార్గము.

[ప్ర. రం.]

---




పేకాట

గిరీశం: పేకాట చాలా చెడ్డదండి. నాభార్య ఎంత చెప్పినా వినక, యింటికైనా వెళ్లక, రాత్రీ పగల్లా అదేధ్యాసంతో ఆడుతూ ఉండేవాణ్ని. విసుగెత్తో, లేక సంసారసుఖం లేకో, అది కన్నవా పోయి రానంటూ ఉంది.

పార్వతీశం: అలాగునండీ! నే నిప్పుడే పోయి పేకదస్తా కొంటాను.



## శ్రీ రమణ మహర్షి

ఈ మహాత్ములు బాల్యముననే తల్లిదండ్రులను, ...దరులను వర్జించి, జగత్పితయగు అరుణాచలేశ్వరుని ...ర్శింప నిశ్చయించి, "తండ్రిని జూడబోయెదను. అది ...లునకే యగును" అని యుత్తరము వ్రాసియుంచి, ...రుణాచలేశ్వరుని సాన్నిధ్యమును బడసి, అరుణాచలమున రమారమి ముప్పదియేండ్ల కాలముగా ఘోరతపంబాచరించి, దర్శించిన మాత్రాన జను స్తదురితకంబుల బోవడచు సామర్థ్యంబు గలిగి, బ్రహ్మసాక్షాత్కారము నొంది, అజ్ఞాల అజ్ఞానాంధకారమును తొలగించుటకై జ్ఞానభాస్కరులై ప్రకాశించుచు రూపబ్రహ్మమై యొప్పుచుండెడివారు.

---

## ౧౮౫౭ సం. పు విప్లవమందలి ఒకవిశేషము

### పంజాబుబ్లాక్ హోలు - అజనాలానుయ్యి

శ్రీయుత్ సుందరలాలు గారు రచించిన 'భారత దేశమున ఆంగ్ల పరిపాలనము' అను గ్రంథమునుండి 'విశాలభారత' (హిందీ) పత్రిక యీవిశేషమును గూర్చిన వర్ణన ముద్ధరించుకొనెను. ఇందలిబొమ్మలుకూడ ఆగ్రంథము నుండియే కైకొని ప్రచురించినది. అందలి ప్రధానవర్ణనము ఆచిత్రములతోసహా యిట ప్రకటితము.

౧౮౫౭ మే నెలయందు లాహోరులో నాలుగు దేశీయపు పటాలములు కేవలము ప్రభుత్వము వారి యనుమానమునకు పాత్రములై ఆయుధములు విడువవలసి వచ్చెను. సిక్కులును, తెల్లవారును వారికి కాపలా. శిబిరము వెలుపడుటకు వారి కనుమతి లేదు. బయట ఫిరంగులు పెట్టియున్నవి. జూలై ౩౧ వ తేదీ రాత్రి ఇందు నెం ౨౬ వ పటాలములోని చాలమంది సిపాయీలు శిబిరమునుండి పారిపోయిరి. వీరికడ నాయుధములును లేవు; వారు ఎన్నటను ఏవిద్రోహమునను పాల్గొనను లేదు. మర్నాడు వారు రావీనది దాటి పోనెంచిరి. అడ్డంకి వచ్చినది. రావీనది గట్టుగట్టుననే వారు అమృతసరమునైపు పోగిరి. వారిని వెంబడించునదిగ జడీ వల్ కమిషనరు సర్ రాబర్ట్ మాంట్‌గుమరీ అనతిచ్చెను. అమృతసరము డిప్టీ కమిషనరు ఫ్రెడరిక్ కూపరు మాంట్‌గుమరీకి సొంతమనిషి. నెం ౨౬ వ పటాలపు ఈ హిందూస్థానీ సిపాయీలు అలసిపోయి, ఆకలితో, నిరాయుధులై, అమృతసరములో నొక తహసీలయిన అజనాలాకు ఆరుమైళ్ల దూరమున రావీతీరమున పడియుండిరి. అజనాలా అమృతసరమునకు ౧౬ మైళ్లు. అటు తరువాతి కథనుగూర్చి ఫ్రెడరిక్ కూపరు 'దిక్రైసిస్ ఇన్ ది పంజాబ్' (The Crisis in the Punjab) అను తనగ్రంథమున మిక్కిలి యభిమానముతో ముచ్చటించెను. కూపరుగారి వర్ణన ననుసరించియే సంక్షిప్తముగా ఆకథ నిట వర్ణింతము.

ఆ సిపాయీలు రావీనదిఒడ్డున పోవుచున్న సంగతి జూలై ౩౧ రెండుజాములకు కూపరుగారికి తెలిసెను. అజనాలా తహసీల్దారును కొంతమంది సాయుధులైన సిక్కుసిపాయీలతో సహా అక్కడకు పంపిరి. సాయంకాలము దాదాపు నాలుగుగంటలకు కూపరుగారు స్వయముగా ౮౦, ౯౦ మంది రౌతులతో అచటకు చేరుకొనిరి. అలసిపోయి ఆకలితో మాడుచున్న ఆమనుష్యులపైని తుపాకులు ప్రేల్చిరి. ఆసిపాయీల సంఖ్య ఇంచుమించు ఐదువందలు. ఇందు దాదాపు నూటరేబదిమంది గుండ్లదెబ్బలకు గాయములు తిని వెనుకకు తిరిగి రావీనదియందు దుమికి మునిగిపోయిరి. ఆకలివలనను, అలసటవలనను బలహీనులై వారు ప్రవాహమున నిలువజాలక పోయిరని కూపరు వ్రాయుచున్నాడు. రావీనదిజలము వారి రక్తముతో నెత్తురయ్యెను. మిగిలిన వారు కొందఱు నీటినుండి బయలుపడి పారిపోయిరియు, కొందఱు ఈతగొట్టియు ఎగువ నొక మైలు దూరమున నొకలంక నాశ్రయించిరి. తరుణమునకు రెండు పడవలు సిద్ధమైనవి. ఇంచు మించు ముప్పదిమంది శస్త్రసైనికుల నాపడవ లెక్కించి వారిని పట్టుకొనుటకు పంపిరి. సైనికు లలువరితుపాకులవారికు వారిపై బారుపెట్టిరి. దూరమునుండి తుపాకులు చూచి ఆ ఆపన్నులు చేతులు జోడించి తమ నిర్దోషిత ప్రకటించి ప్రాణదానము వేడిరి. ఈసమయముననే ౫౦ మంది వఱకు నిరాశులై నీటిలో మునిగి మరి కనబడలేదు. మిగతవారిని పట్టుకొని కొలది కొలది మందిగ పడవలపై గట్టుచేర్చిరి. అచట వారి కంఠమాలలు మున్నగునవి త్రెంపి పారవేసిరి. వారిని వేరువేరు గుంపులుగా నేర్పఱచి కట్టి హోరున వాన కురియుచుండ సిక్కురౌతుల కాపుదలతో మెల్లమెల్లగా అజనాలా చేర్చిరి.

అర్ధరాత్రమున మొత్తము ౨౮౨ రు సిపాయీలును అజనాలాఠాణా చేరుకొనిరి. అందు కొందఱు ఆ క్షీ ప వ్ల మ న దే శ ము వా రు గూ డ గ ల రు. అజనాలా ఠాణాయందు వీరందరిని ఉరితీయుటకు త్రాళ్లును, కాల్చి చంపుటకు ఏబది మంది సశస్త్రులైన

సిక్కు సైనికులను కూపరు తొలినుండి సిద్ధపఱచియుం చెను. కాని వర్షమువలన ఈపని ప్రొద్దుటికని నిలుపుచేసిరి. అందఱును కాజాయింట పట్టుకొనిరి. దగ్గఱనే తహసీలు తాలూకు క్రొత్తకట్టడము పూర్తియై సిద్ధముగ నుండెను. చాల మందిని ఉదయమునకుపు పోలీసు కాజాయందు బంధించిరి. ౬౬ గురిని మాత్రము తహసీలు కట్టడములో ఒక చిన్న సుమ్మటపు గదిలో కుక్కిరి.



తహసీలు కట్టడమునందలి సుమ్మటపుగది

సుమ్మటపు గది చాల ఇరుకైనది. వానికి వైపుల తలుపులు మూసివేసిరి.

మర్నాడు ఒకటవ ఆగస్టు బక్రీదు. ప్రొద్దుట ఆవిర్భాగ్యుల సంకలిని పదిపది మందిగా బయటికి తెచ్చిరి. కూపరు కాజాయెదుట కూర్చుండియుండెను. పదిమంది సిక్కు సిపాయిలు ఒకప్రక్క తుపాకులతో నిలిచియుండిరి. తక్కిన నలుబది మంది వారి సమీపమున తోడుగ నిల్చిరి. ఎదుట వచ్చుటతోడనే ఈ ఖైదీలను ప్రేల్చి వేయుచుండెడివారు. వీరిలో చాల మంది హిందువులు. అందు కొందఱు చనిపోవు సమయమున సిక్కులకు గంగాదేవిపై ఒట్టుపెట్టి తిట్టుచుండెడివారని వ్రాసియున్నది. కాజాలోని ఖైదీలు పూర్తికాగా సుమ్మటపు గదిలోని ఖైదీలను బయటికి తెచ్చిరి. ౨౩౭ గురు సిపాయిలు గుండు దెబ్బల మరణించిరి; సుమ్మటపు గదినుండి ౨౧ మంది మాత్రమే వెలుపటికి వచ్చిరి. ఇంతలో మిగిలిన ఖైదీలు రామనుచున్నారని కూపరునకు వార్త వచ్చెను.

మొదట వారిని సంహరింప నేర్పాటుచేసి లోనికి పోయి చూడగా తక్కిన ౪౫ గురు సిపాయిల శవములు నచ్చుట దొరకినవని కూపరు వ్రాయుచున్నాడు. అందు కొంతమంది కను వెక్కివెక్కి యేడ్చుచుండిరేమో కూడను. "తెలియకయే మరల హాల్వెల్ బ్లాక్ హోలు హత్యకాండ పునః ప్రదర్శితమయ్యెను"* అని కూపరు పలుకులు.

హాల్వెలు బ్లాక్ హోలుకథ అసత్యము కాని కూపరుగారి అజనాలా బ్లాక్ హోలు సత్యమైన సంఘటనమని వేరుగ చెప్పనక్కరలేదు.

రాత్రి వారు నీరనియు, గాలియనియు నరచిరి కాని పైగొడవలో నది హారావాండ్రకు వినబడలేదని కూపరు వ్రాయుచున్నాడు. అలసటవల్లను, ఉక్కవల్లను, గాలి లేమివల్లను లోన మాడి యూపిరాడక చచ్చిన ౪౫ గురి శవములను పైకీడ్చుకొనివచ్చి పడవేసిరి.

ఒక్క చిక్కు తిరువాయి; ఈ శవములను పూడ్చ వలెను. అజనాలాతాలూకా ఇంచుమించు నూరుగజముల దూరమున ఒక ప్రాతనుయ్యి యుండెను. పాకీవాం



అజనాలానూయి—దిబ్బపట్టున నున్నది.

డ్రచేత ఆశవము లన్నింటి నీడిపించి ఈడిపించి ఆనూతిలో వేయించిరి. తక్కిన మాతిని మట్టితో కప్పించి పైనొక గట్టు యగునటు మట్టి పోయించిరి. ఈనూ

---

*Uuconsciously, the tragedy of Holwell's Black Hole had been re-enacted"—'The Crisis of the Punjab', by Frederic Cooper.

